# IV. ఇస్లామ్ యొక్క నాల్గవ మూల స్థంభం : రోజహ్ (ఉపవాసము)

## 1. రమజాన్ యొక్క విశిష్టిత & శ్రేయో శుభాలు

దివ్య ఖుర్ఆన్ అవతరించిన నెల రమజాన్ నెల. ఇది ఎంతో శుభప్రదమైనది. ఈ నెలలో విశ్వాసుల ఆహారాదులలో సమృద్ధి కలుగును. విశ్వాసుల ఆరాధనలకు అనేకరెట్లు పుణ్యఫలము లభించును. ఈ నెలలో ఉపవాసాలు విధిగా నిర్ణయింప బడినవి. ఈ నెలలో ఫిత్రా దానము ఇవ్వాలని, తరావీహ్ నమాజ్ ఆచరించాలని ఆదేశింప బడినది. అల్లాహు తఆలా యొక్క సాన్నిధ్యాన్ని పొందడానికి, ఆయనను ప్రసన్నుని చేయడానికి ఉద్దేశింప బడిన 'ఇత్తికాఫ్', వెయ్యి రాత్రుల కంటే శ్రేష్ఠమైన రాత్రి, 'లైలతుల్ ఖద్ర్' ఈ నెలలోనే ఉన్నవి. కనుక ఈ నెలను అపారమైన వరాలను పొందే నెల అనవచ్చును.

**"మీపై ఒక శుభ ప్రదమైన నెల రానున్నది. దాని ఉపవాసాలను అల్లాహు తఆలా మీపై విధిగా చేశాడు. ఈ నెలలో స్వర్గద్వారాలు తెరచివేయ బడతాయి. నరక ద్వారాలు మూసివేయ బడతాయి. షైతానులు బంధించ బడతారు. వేయి నెలల కంటే శ్రేష్ఠమైన రేయి ఒకటి ఈ నెలలోనే ఉంది. ఎవరైతే దీని శుభాలను కోల్పోయాడో అతను వాస్తవానికి ఎంతో దౌర్భాగ్యుడు"** అని మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఉపదేశించారని హజ్రత్ అబూహురైరా గారు తెలిపిరి.

రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: "పవిత్రమైన రమజాన్ మాసము ప్రారంభమున స్వర్గద్వారములు తెరువబడును, నరక ద్వారములు మూసివేయబడును. షైతానులు సంకెళ్ళచే బంధింప బడును." (బుఖారీ, ముస్లిమ్)

పవిత్రమైన రమజాన్ మాసము ప్రారంభమైనచో, అల్లాహ్‌కు విధేయులై సర్వదా ఆజ్ఞాపాలనచేయు పుణ్యపురుషులు అల్లాహు తఆలాకు వినయ విధేయతలను ప్రదర్శిస్తూ ఆరాధనయందు నిమగ్నులగుదురు. ఈ నెలలో పగలు పవిత్రమైన ఖుర్ఆన్‌ను పఠించుటలోను, అల్లాహు తఆలా నామస్మరణ లోను గడుపుదురు. రాత్రులలో ఎక్కువ భాగం తహజ్జుద్ నమాజ్‌లోను, దుఆ(వేడుకోలు),

ఇస్తిగ్ఫార్ (మన్నింపు) మొదలగు వాటిలో గడిపెదరు. ఈ పుణ్యకార్యాల ఫలితంగా మామూలు రోజులలో తెలిసి తెలియక చేసే పొరబాట్లు, పాపాలు ఒకటి అర యుంటే, అవి చాలా వరకు తగ్గిపోతాయి లేదా అవి అసలు జరుగవు.

పవిత్రమైన రమజాన్ మాసములో, ఎవరైనా అల్లాహు తఆలాను ప్రసన్నుని చేయుట కొరకు ఫర్జ్ ఆరాధనలకు అదనంగా సున్నత్, నఫిల్ ఆరాధనలు ఆచరించినచో, ఇతర రోజులలోని ఫర్జ్‌తో సమానంగా పుణ్యఫలము లభించును. ఫర్జ్ ఆచరించిన మామూలు రోజుల కన్నా 70 రెట్లు అధికముగా పుణ్యఫలము లభించును.

ఇది సహనపు మాసము. ఇది శుభ ప్రదమైనది. అల్లాహు తఆలా యొక్క అనుగ్రహాలతోను, కారుణ్యముతోను నిండి యున్నది. ఈ మాసములో విశ్వాసుల రిజ్క్ (ఉపాధి)లో అభివృద్ధి కలుగును. ఈ నెలలోని మొదటి పది రోజులు అల్లాహ్ యొక్క కారుణ్యముతోను, రెండవ పది రోజులు క్షమాపణ, మన్నింపుతోను, చివరి పది రోజులు నరకాగ్ని నుండి విముక్తితోను కూడి యున్నవి.

అల్లాహు తఆలా మనకందరికి ఈ మాసపు ఔన్నత్యాని గుర్తించే మార్గదర్శమును కలిగించుగాక. అల్లాహు తఆలాను ప్రసన్నుని చేయుటకు అత్యధికముగా పుణ్య కార్యాలు ఆచరించుటకు, ఆచరింపజేయుటకు కావలసిన అనుగ్రహాన్ని ప్రసాదించుగాక. (ఆమీన్)

## 2. రో జ హ్ (ఉపవాసము)

రోజ (ఉపవాసము) అంటే ఆగి ఉండుట, అదుపు చేసుకోవటం, కట్టుబడి ఉండటం అని అర్థము. ఆరాధనా సంకల్పంతో సుబహ్‌సాదిఖ్ (ఉషోదయము) నుండి సూర్యాస్తమయము వరకు ఆహార పానీయాలు, శారీరక మానసిక వాంఛలకు దూరముగా యుండుటను రోజ (ఉపవాసము) అంటారు. అరబీ భాషలో రోజను "సౌమ్" అని " సియామ్" అని కూడ అందురు. రోజను విరమించుటను "ఇఫ్‌తార్" అని అంటారు. (బిహిష్తీజేవర్, 3/2, దీనియాత్ 7 యం, స.68)

రమజాన్ నెలలో ప్రతి ముస్లిం ఉపవాస ముండుట ఫర్జ్ – ఎ– ఐన్ (తప్పని సరిగా ప్రతి ఒక్కరు పాటించ వలసినది). ఈ విధిని నిరాకరించినవాడు

కాఫిర్ (అవిశ్వాసి) అవుతాడు. షరీఅత్ పరమైన ఎలాంటి కారణము (మినహాయింపు) లేకుండ రమజాన్ ఉపవాసాలను విడిచిపెట్టిన వ్యక్తి ఫాసిఖ్ (ఘోర పాపాత్ముడు) అవుతాడు.

"షరీఅత్ పరమైన కారణము గాని లేక వ్యాధి గాని లేకుండ (మినహాయింపు లేకుండ) ఎవరైన రమజాన్ నెలలో ఒక్క ఉపవాసము వదిలివేసినను, అతను జీవితాంతము ఉపవాసము పాటించినను మానివేసిన ఉపవాసాన్ని భర్తీచేయలేవు" అనగా అంతటి పుణ్యఫలము లభించదు. (తిర్మిజీ, అబూదావూద్)

## 3. రోజహ్ విధి (ఫర్జ్) కావింప బడుట

ఇస్లామ్ యొక్క ప్రాధమిక (మూల) బోధనలలో ఈమాన్, నమాజ్, జకాత్ తరువాతి స్థానము రోజకు యున్నది.

**పవిత్రమైన ఖుర్ఆన్ లో ఇట్లు తెలుపబడి యున్నది: ఓ విశ్వాసులారా! మీలో ధర్మనిష్ఠ, పాపభీతి, భయ భక్తులు కల్గుట కొరకు, మీ పూర్వపు సమాజా (ఉమ్మత్) లపై ఎట్లు ఉపవాసముండుట ఫర్జ్ (విధి) గావింపబడి యుండినదో, అట్లే మీపై కూడ ఫర్జ్ చేయబడినది.** (బఖర/183)

మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ ఇట్లు తెలిపిరి: **"అల్లాహు తఆలా పవిత్రమైన రమజాన్ మాసములో ఉపవాసముండుట మీపై 'విధి (ఫర్జ్)' గావించెను. నేను మీ కొరకు తరావీహ్ నమాజ్‌ను 'సున్నత్' గావించితిని."** అల్లాహు తఆలా యొక్క వాగ్దానాలపై సంపూర్ణ విశ్వాసముతో, అతని నుండి లభించే పుణ్యఫలాపేక్షతో రమజాన్ మాసములో ఉపవాసాలు ఉండి, తరావీహ్ నమాజ్ ఆచరించిన వ్యక్తి, ఈ రోజే తన తల్లి నుండి జన్మించిన శిశువు వలె, తన సమస్త పాపాల నుండి పరిశుద్ధుడగును. (ఇబ్నె మాజహ్)

రమజాన్ మాసపు రాత్రులలో అల్లాహు తఆలా యొక్క వాగ్దానాలపై సంపూర్ణ విశ్వాసముతో, అతని నుండి లభించే పుణ్యఫలాపేక్షతో రమజాన్ మాసములో తరావీహ్ నమాజ్ ఆచరించిన వ్యక్తి పూర్వపు సమస్త పాపాలు క్షమించ బడతాయి. (బుఖారీ, ముస్లిమ్)

ఇస్లామ్‌లో రమజ్జాన్ నెల పూర్తిగా ఉపవాసముండుట విధి (ఫర్జ్) కావింప బడినది. ఎవరైనా షరీఅత్ పరమైన కారణము(మినహాయింపు) లేకుండ రమజాన్ మాసములో ఒక రోజు కూడ ఉపవాస ముండనిచో, అతను గొప్ప పాపిగా పరిగణింప బడును. ఇంకొక హదీసులో ఇట్లున్నది: **ఎవరైన ఒక వ్యక్తి షరీఅత్ పరమైన ఎలాంటి కారణము (మినహాయింపు) గానీ లేక వ్యాధి గానీ లేకుండ ఒక్క రోజు ఉపవాసము విడిచి పెట్టినను, దానికి బదులు అతను తన జీవితాంతము ఉపవాసముండినను, ఆ విడిచిపెట్టిన ఉపవాసముతో సమానము కాదు.** (తిర్మిజి, అబూదావూద్, ఇస్లాం క్యాహై?, స.42)

రమజాన్ మాసములో వయోజనులైన (బాల్యమును వదలిన) ప్రతి ముస్లిం స్త్రీ పురుషుల కొరకు ఫర్జ్ కావింపబడి యున్నవి. అనారోగ్యము నుండి ఆరోగ్యవంతుడయ్యే ఆశ లేకున్నను, లేక వృద్ధాప్యపు బలహీనత వల్ల ఉపవాసముండలేని యెడల, భవిష్యత్తులో శక్తి కలిగే ఆశ లేనిచో, అతను రోజాకు బదులు "ఫిదియ"(మూల్యం చెల్లించుట) ఇవ్వ వలెను. (బిహిష్తీజేవర్, 3/2,దీనియాత్ 2 యం,/72)

## 4. రోజహ్ యొక్క పుణ్యము

**"మనిషి చేసే ప్రతి పుణ్య కార్యానికి పది నుండి ఏడు వందల రెట్ల దాకా పుణ్యఫలము లభించును. కాని రోజాను గురించి అల్లాహ్ ఇలా తెల్పెను: 'మనిషి చేసే ఆచరణలన్నీ తన స్వయానికి సంబంధించినవే, ఒక్క ఉపవాసం మినహా. ఉపవాస విషయం ప్రత్యేకమైనది. అది కేవలం నాకోసమే పాటించ బడుతుంది. స్వయంగా నేనే (తలచుకున్నంత) దానికి ప్రతిఫలం ప్రసాదిస్తాను. దాసుడు నాకోసం మాత్రమే తన కోరికలను, అన్నపానీయాలను మానుకుంటాడు."** (బుఖారీ, ముస్లిమ్)

అల్లాహ్‌ను ప్రసన్నుని చేయుట కొరకు ఆరాధనా సంకల్పంతో, రోజలో ఆహార పానీయాలు, శారీరక మానసిక కోరికలను విడిచి పెట్టబడును. మన కోరికలు రుచులు విడిచి పెట్ట బడును. అందువల్ల, అల్లాహ్ దాని పుణ్య ఫలాన్ని కూడ అధికముగా నిర్ణయించి యున్నాడు. రోజ యొక్క పుణ్యఫలాన్ని స్వయంగా అల్లాహ్‌యే ప్రసాదిస్తాడు. సమస్త పాపాలను క్షమించివేస్తాడు. రోజ నరకాగ్ని

నుండి రక్షించే డాలు లాంటిది. ఉపవాసముందు వారిని నరకాగ్ని నుండి రక్షించు దృఢమైన కోట లాంటిది. వారి నోటి వాసన అల్లాహ్ చెంత ముష్క్ (శ్రేష్ఠమైన సుగంధ ద్రవ్యము) యొక్క సువాసన కన్న శ్రేష్ఠమై యున్నది. (ఇస్లాం క్యా హై?, స.43)

## 5. రోజహ్ యొక్క ఆత్మ

**"కేవలము అన్నపానీయాలకు దూరముగా యుండుటయే ఉపవాసము కాదు. చెడుగు, దుర్భాషలాడటానికి దూరముగా ఉండటం కూడా ఉపవాసములో అంతర్భాగమే. ఎవరైనా తనను తిడితే, నేను ఉపవాసమున్నానని పలుకమని"** రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (బుఖారీ)

**"ఉపవాసముండి కూడ అసత్యాన్ని పలుకుట, చెడు మాటలు మాట్లాడుట, చెడును ఆచరించుట వదలనిచో, అతడు అన్నపానీయాలు వదలిపెట్టడం (ఉపవాసముండుట) అల్లాహు తఆలాకు ఏమాత్రం అక్కరలేదని"** రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (బుఖారీ)

అనగా ఉపవాస ముంచుటలో అల్లాహ్ యొక్క ముఖ్య ఉద్దేశ్యమేమనగా, మానవుని పవిత్రుని చేయుటయే. ఉపవాస ముండియు చెడును విడిచిపెట్టి మంచిని అలవాటు చేసుకొనక, సత్యమనే పునాదిపై తన జీవితమనే భవనాన్ని నిర్మించుకొనక, రమజాన్ నెలలో కూడ అసత్యమును పలుకుచు, చెడుకార్యాలు ఆచరిస్తూ జీవితాన్ని గడుపుచు, రమజాన్ తరువాత కూడ అతని జీవితంలో మార్పులేనిచో, ఇటువంటివారు ఉదయం నుండి సాయంత్రం వరకు ఎందుకు ఆహార పానీయాలు విడిచి పెట్టుచున్నారో, కొద్దిగా ఆత్మపరిశీలన చేసుకోవాలి. (రాహె అమల్, స. 83)

ఈ హదీసు యొక్క ముఖ్య ఉద్దేశ్యము ఏమనగా, ఉపవాసముండువాడు ఉపవాసము యొక్క ముఖ్య ఉద్దేశ్యాన్ని, అనగా అన్నివిధాలుగా చెడును విడిచి పెట్టి మంచిని అలవరచుకోవడం అన్నది గుర్తుంచుకొని అమలుపరచాలి. రమజాను నెల ఒక శిక్షణ కాలము. ఆ శిక్షణ ఫలితాన్ని రమజాన్ నెలలోనే కాక సంవత్సర మంతయు, సంవత్సరమేకాక జీవితమంతయు అమలో పెట్టవలసినదిగా గుర్తుంచుకోవాలి. (రాహె అమల్, స. 83)

## 6. రోజహ్ వలన కలుగు ముఖ్య లాభాలు

రోజ వలన ఒక ముఖ్య లాభమేమనగా, మానవునిలో ధర్మనిష్ఠ, అల్లాహు తఆలాపై భయభక్తులు, చెడును విడిచి మంచిని గ్రహించుట మొదలగు మంచి గుణములు అలవడుతాయి. మనస్సు యొక్క కోర్కెలను జయించే శక్తి కలుగుతుంది. అల్లాహ్ యొక్క ఆజ్ఞను అమలు పరచుట కొరకు మనస్సు యొక్క కోర్కెలను అణగద్రొక్కే అలవాటు కలుగుతుంది. ఆత్మకు సక్రమమైన శిక్షణ లభిస్తుంది. ఆత్మబలం అభివృద్ధి చెందుతుంది.

పైలాభాలు కలుగ వలెనన్న రెండు విషయాలయందు శ్రద్ధ వహించ వలెను. అవి: **01.** ఉపవాసముండువాడు వాటిని పొందాలనే ఉద్దేశ్యాన్ని కలిగి యుండాలి. **02.** మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ తెలిపిన విధముగా ఆచరించాలి. అనగా చిన్నవి గానీ పెద్దవి గానీ సమస్త పాపకార్యాల నుండి దూరముగా యుండాలి. అసత్యమాడరాదు. చాడీలు చెప్పరాదు. ఇతరులతో పోట్లాడరాదు. బాహ్య ఆంతరంగిక సమస్త చెడును విడిచి పెట్టాలి. కండ్లతో చెడును చూచుట, చెవులతో చెడును వినుట, చేతులతో చెడును చేయుట, కాళ్ళతో చెడు వైపుకు వెళ్ళుట మొదలగునవి బాహ్య చెడుకు సంబందించినవి. మనసులో ఇతరులను గురించి చెడుగా భావించుట, ఈర్ష్యా ద్వేషాలు కలిగి యుండుట మొదలగునవి ఆంతరంగిక చెడుకు సంబంధించినవి. వీటినన్నింటినీ విడిచి పెట్టాలి. (ఇస్లాం క్యా హై?, స.45.)

హజ్రత్ రసూల్లుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఇట్లు తెలిపిరి: రోజ మరియు పవిత్రమైన ఖుర్ఆన్ దాసుని క్షమింపమనియు, మరియు కారుణ్యమును ప్రసరింప జేయమని అల్లాహు తఆలాతో సిఫారసు చేయును. "ఓ పోషకుడా (అల్లాహ్) ! నేను ఇతనిని పగలు ఆహార పానీయాలకు, శారీరక మానసిక కోరికలకు దూరముగా యుంచితిని. కాబట్టి ఇతని విషయంగా నా సిఫారసు అంగీకరించుము" అని రోజహ్ పలుకును. "ఓ అల్లాహ్! ఇతను రాత్రిపూట నిలబడి నమాజ్‌లో నన్ను చదివెను. నేను ఇతనిని రాత్రులందు నిద్రకు దూరము చేసితిని. కాబట్టి ఇతని విషయంగా నా సిఫారసును అంగీకరించుము" అని ఖుర్ఆన్ పలుకును. అల్లాహు తఆలా ఆవ్యక్తి విషయంలో ఆరెండింటి సిఫారసును

అంగీకరిస్తాడు. (బైహఖీ, ముస్లిమ్ ఖవాతీన్ కే లియే 20 సబఖ్, స.26)

అల్లాహు తఆలా చెంత ఉపవాస ముండువాని కొరకు గౌరవ ప్రదమైన గొప్ప స్థానము కలదు. "ఇతని నోటి నుండి వెలువడు (ఒక విధమైన) వాసన అల్లాహ్ చెంత మిక్కిలి శ్రేష్ఠమైన సుగంధ ద్రవ్యము 'ముష్క్' (కస్తూరి) యొక్క సువాసన కన్నా అధిక ప్రాధాన్యాన్ని కలిగి యున్నది" అని మన ప్రవక్త హ్జ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. ఇంతేకాక " ఉపవాసముండువాని కొరకు రెండు సంతోషాలు కలవు - 1. ఇఫ్తార్ (ఉపవాస విరమణ) సమయంలో, 2. విశ్వప్రభువు ఐన అల్లాహు తఆలాను కలుసుకొనిన సమయయంలో" అని కూడ మన ప్రవక్త హ్జ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (ముస్లిమ్ ఖవాతీన్ కె లియె 20 సబఖ్, స.26)

కాబట్టి రమజాన్ నెలలో నిష్ఠతో ఉపవాసములు ఉండండి. వాటిని ఎటువంటి పరిస్థితులలోను విడిచి పెట్టకండి. తీవ్ర వ్యాధి వలన గానీ, ప్రయాణము వలన గానీ ఉపవాసము విడిచి పెట్టిన, వీలైనంత తొందరగా వాటి ఖజా పూర్తి చేయండి.

ప్రతి వస్తువుకు దాని అనుకూల వాతావరణము ఉంటుంది. సందర్భాను సారం ఆ వస్తువు యొక్క ధర పెరుగుతుంది. రమజాన్ నెలలోని రోజాకు అత్యధికమైన ఘనత, మర్యాద, విలువ యున్నది. అందు వలననే "ఎవరైనా రమజాన్ మాసంలో షరీఅత్ అనుమతించిన కారణము లేకుండా లేక తీవ్రమైన వ్యాధి లేకుండా రమజాన్ నెలలో ఒక్క ఉపవాసాన్ని విడిచిపెట్టినచో, దానికి బదులుగా అతడు జీవితాంతము ఉపవాసముండినను దానికి బదులు కాజాలదు" అని మన ప్రవక్త హ్జ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. అనగా ఖజా ఉపవాసముండినచో అల్లాహు తఆలా యొక్క ఆజ్ఞను అమలు పరచిన వారగుదురు. కానీ రమజాన్ నెలలో ఉపవాస ముంచిన లభించే ఔన్నత్యము, ఘనత, మర్యాద మాత్రము లభించదని అర్థము. (ముస్లిమ్ ఖావాతీన్ కే లియే బీస్ సబఖ్,స.26)

## 7. వివిధ విధాలైన ఉపవాసాలు (రోజాలు)

ఔన్నత్యం-ప్రాముఖ్యం, ధర్మసమ్మతం-ధర్మవ్యతిరేకాల రీత్యా ఉపవాసాలు ఆరు రకాలుగా ఉన్నాయి. అవి: **01.** ఫర్జ్ **02.** వాజిబ్ **03.** సున్నత్ **04.** నఫిల్

**05.** మక్రూహ్ **07.** హరామ్.

## 7.1. ఫర్జ్

సంవత్సరములో ఒక నెల అనగా పవిత్రమైన రమజాన్ నెలలో ఉపవాసములుండుట విధి (ఫర్జ్) గావింపబడి యున్నవి. ఇలాగే రమజాన్ నెలలో తప్పిపోయిన ఉపవాసాలు పూర్తి చేయుట (ఖజ) కూడ విధియై యున్నది.

## 7.2. వాజిబ్

మ్రొక్కుబడి మరియు ప్రాయశ్చిత్తము (కఫ్ఫారహ్) కొరకు ఆచరించు ఉపవాసాలు వాజిబ్(తప్పనిసరి) అయి యున్నవి. ఫలానా కార్యము పూర్తయితే ఫలానా రోజు ఉపవాస ముంటానని మ్రొక్కుబడి చేసుకుంటే, మ్రొక్కుబడి తీరిన తరువాత దానిని ఆ రోజు పూర్తి చేయుట వాజిబ్ అవుతుంది. రోజు నిర్ణయించుకో కుండ మ్రొక్కుబడి చేసుకుంటే, మ్రొక్కుబడి తీరిన తరువాత వీలైనంత త్వరలో ఆ ఉపవాస ముండాలి.

## 7.3. సున్నత్ (మస్నూన్)

ఏ రోజులలో మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ఉపవాస ముండినట్లు లేక ఉపవాస ముండుటకు ప్రోత్సహించినట్లు తగిన ఆధారాలున్న వాటిని సున్నత్ అంటారు. ఉదా: **ఆషురే కా రోజ** అనగా ముహర్రమ్ నెలలో తొమ్మిది (9) మరియు పది (10) లేక పది (10) పదకొండు (11) తేదీలలో ఉపవాసముండుట, **అరఫే కా రోజ** అనగా జిల్‌హజ్జా నెల యొక్క తొమ్మిదవ (9) తేదీన ఉపవాస ముండుట, మరియు **అయ్యామె బీజ్** అనగా ప్రతి ఇస్లామీ నెల 13, 14, 15 తేదీలలో ఉపవాస ముండుట మొదలగునవి. ఇవి గైర్ ముఅక్కద రోజాలు. వీటిని తప్పక పాటించాలనే నియమము లేదు. పాటించితే పుణ్యం లభిస్తుంది, లేదంటే పాపమేమియు లేదు.

## 7.4. నఫిల్

ఇవి ఐచ్ఛిక ఉపవాసాలు. ఫర్జ్, వాజిబ్ మరియు సున్నత్ ఉపవాసలను మినహాయించిన మిగిలిన అన్ని ఉపవాసాలు నఫిల్ ఉపవాసాలు. ఇవి ముస్తహబ్. (అభిలషణీయం) ఉదా: షవ్వాల్ నెలలో 6 ఉపవాసాలు, ప్రతి సోమ, గురు

వారాలలో ఉపవాసముండుట, జిల్ హిజ్జ నెల తొలిదశకంలోని ఎనిమిది ఉపవాసాలు లేక రెండు పండుగ రోజులలోను, బక్రీద్ పండుగ తరువాతి మూడు రోజులు అనగా మొత్తము 5 రోజులలో తప్ప మిగిలిన రోజులలో అల్లాహ్‌ను ప్రసన్నుని చేయుటకు ఉపవాసముండిన, అవి నఫిల్ ఉపవాసాలు అనబడును.

## 7.5. మక్రూహ్ (అవాంఛనీయమైన ఉపవాసాలు)

మక్రూహ్ అంటే దైవానికి అయిష్ట మయినవి అని అర్థము. కొన్నిరోజులు ఉపవాసాలుండుట మక్రూహ్ చేయబడ్డాయి. ఉదా: ముహర్రమ్ నెలలో కేవలం 10 వ తేదీ మాత్రమే ఉపవాస ముండుట మక్రూహ్ అగును.

## 7.6. హరామ్ (నిషిద్ధము)

సంవత్సరములో 5 రోజులు ఉపవాస ముండుట ముస్లింల కందరికీ హరామ్ చేయబడినది.(నిషేధించబడినవి) అవి: 01. ఈదుల్‌ఫిత్ర్ అనగా రమజాన్ పండుగ రోజు, 02. ఈదుల్‌అజ్హా (బక్రీద్) పండుగ రోజు, మరియు అయ్యామె తష్‌రీఖ్ యొక్క 3 రోజులు అనగా జిల్ హిజ్జా యొక్క 11, 12, 13 తేదీలలో ఉపవాసాలు. (దీనియాత్ 2 యం, స.68)

## 8. రోజహ్ (ఉపవాసము) కొరకు షరతులు

**01**. ముసల్మాన్ అయి ఉండాలి.

**02.** హైజ్ (బహిష్టు రక్తస్రావము) మరియు నిఫాస్ (ప్రసవించిన తరువాతి రక్తస్రావము) ల నుండి పరిశుభ్రముగా యుండాలి.

**03.** నియ్యత్ అనగా ఉపవాసముండుటకు సంకల్పము చేసుకోవాలి. (బిహిష్తీజేవర్, 3/3, దీనియాత్ 2 యం, స.69)

## 9. రోజహ్(ఉపవాసము)లో ఫర్జ్‌లు

ఉపవాసములో 3 ఫర్జ్‌లు ఉన్నాయి.

**01.** ఉపవాసము కొరకు సంకల్పము చేయాలి.

**02.** సుబహ్ సాదిఖ్ అనగా ఉషోదయం నుండి సూర్యుడు అస్తమించే వరకు ఆహారపానీయాలు గానీ లేక ఏ ఇతరములు గానీ కడుపు లోనికి పోనీయ కూడదు.

**03.** సంభోగము చేయరాదు.

## 10. రోజహ్ లో సున్నత్‌లు

**01.** సహ్‌రీ (ఉషోదయమునకు పూర్వము చేయు భోజనము) ఆలస్యముగా చేయుట అనగా ఉషోదయానికి కొద్దిగా ముందు భుజించుట.

**02.** ఇఫ్తార్ (ఉపవాసమును విరమించుట) సమయము కాగానే ఉపవాసమును విరమించుట.

**03.** పవిత్రమైన ఖుర్‌ఆన్ గ్రంథమును చదువుట.

**04.** అనవసరపు మాటలను విడిచి పెట్టుట.

## 11. రోజహ్ (ఉపవాసము) ఎవరిపై విధియై యున్నది?

వివేచనా జ్ఞానముగల వయోజనులు (ప్రాజ్ఞ వయస్సుగలవారు), ఆరోగ్యవంతులు, స్థానికులు అయిన ప్రతి ముస్లిమ్ స్త్రీ పురుషులపై పవిత్రమైన రమజాన్ నెలలో ఉపవాసము లుండుట విధియై యున్నది. ఉపవాసాలను నిరాకరించువారు అవిశ్వాసులగుదురు. తగిన కారణము లేకుండ విడిచిపెట్టువారు పాపాత్ములగుదురు. ((బిహిష్తీజేవర్, 3/3, దీనియాత్ 2 యం, స.69)

**నోట్:** బుద్ధి జ్ఞానము లేని పిచ్చివారిపై, యుక్త వయస్సుకు చేరని వారిపై ఉపవాసము లుండుట విధి కాదు. ఉపవాస ముంచుట, నమాజ్ చదివించుట యుక్తవయస్సుకు చేరక ముందు నుంచే అలవాటు చేయ వలయునను ఆదేశమున్నది.

## 12. రోజహ్ (ఉపవాసము) ఎవరిపై విధి కాదు?

యుక్త వయస్సుకు చేరని పిల్లలపై ఉపవాసము విధి కాదు. వ్యాధిగ్రస్తులకు, ప్రయాణీకులకు, రుతుస్రావము పురుటిస్రావానికి లోనై ఉన్న స్త్రీలకు, గర్భిణులకు, బాలింతలకు సడలింపు గలదు. వీరు రమజాన్ నెలలో ఉపవాసము పాటించక పోయినను పర్వాలేదు. వీరు రమజాన్ తరువాత ఆ ఉపవాసాల ఖజా పాటించాలి. కడు వృద్ధులైన స్త్రీపురుషులు, స్వస్థత చేకూరునను ఆశలేని రోగగ్రస్తులు ఫిదియా చెల్లించాలి.

## 13. స హ్ రీ (ఉషోదయమునకు పూర్వపు భోజనము)

ఉపవాసము ఉండే ఉద్దేశ్యముతో ఉషోదయానికి పూర్వము తీసుకొనే **ఆహార పానీయాలను సహ్రీ** అందురు. సహ్రీ తినుట శుభ ప్రదమైనది. సౌభాగ్య ప్రదమైనది. ఒక హదీసులో ఇట్లున్నది: **"సహ్రీ భుజించండి. సహ్రీ భుజించడంలో శుభం ఉంది"**(ముస్లిం) ఉపవాసముండుట కొరకు సహ్రీ చేయుట సున్నత్ అయి యున్నది. ఇది మిక్కిలి శ్రేయస్కరమైనది. దీని మూలముగా పగలంతయు శక్తి కలుగును. ఒక హదీసులో ఇట్లున్నది: **"రాత్రివేళ ప్రార్థన కొరకు పగటి నిద్ర ద్వారా శక్తి పొందండి, పగటివేళ రోజ పాటించేందుకు సహ్రీ భుజించడం ద్వారా శక్తి పొందండి".**(ఇబ్నెమాజ) సహ్రీ ఆలస్యముగా తినడం సున్నత్. ఇక్కడ ఆలస్యముగా అంటే ఉషోదయానికి కొన్ని నిమిషాలు ముందుగా అని అర్థం. ఏదైనా కారణముగా సహ్రీ భుజించక పోయినను ఉపవాసముండుట తప్పనిసరి. సహ్రీ భుజించకనే ఉపవాసముండినను ఉపవాసము సంపూర్ణమగును. (బిహిష్తీజేవర్,3/14),

## 14. ఇ ఫ్తా ర్ (ఉపవాసపు విరమణ)

ఇఫ్తార్ అనగా ఉపవాసపు విరమణ. ఇఫ్తార్ చేయించుట ఒక పుణ్య కార్యము. ఒక హదీసులో ఇట్లున్నది: **ఇఫ్తార్ సమయములో చేయబడే దుఆ నిరాకరింప బడదు.** (బుఖారీ) ఖర్జూరముతో ఇఫ్తార్ చేయుట ముస్తహబ్ (అభిలషణీయము). ఖర్జూరపు పండ్లు లభించనిచో నీటితో చేయడం అభిలషణీయము. ఇఫ్తార్ చేయుటలో త్వరపడ వలెను. అనగా ఉపవాసపు సమయము ముగిసిన వెంటనే అని అర్థము. **'ఆఖరి వేళలో సహ్రీ తినుచు, ఇఫ్తార్ చేయుట యందు త్వరపడినంత కాలము నా అనచర సమాజము సన్మార్గముపై యుందురని"** మన ప్రవక్త రసూల్లుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (బుఖారీ, ముస్లిమ్, మస్నద్అహ్మద్,5/172)

### ఇఫ్తార్ చేయించుట యొక్క విశిష్టత

ఉపవాసికి ఇఫ్తార్ చేయించుట పాప క్షమాపణ కొరకు, నరకము నుండి రక్షణకు కారణ మగును. ఇఫ్తార్ చేయించిన వారికి కూడ ఉపవాసితో

సమానంగా పుణ్యము లభించును, కానీ ఉపవాసి పుణ్యఫలములో కొద్దిగా కూడ తగ్గింప బడదు" అని మన ప్రవక్త రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. "ఈ పుణ్యఫలము గుక్కెడు నీళ్ళు లేక గుక్కెడు పాలు తాపించిన వారికి లేక ఒక ఖర్జూరపు పండుతో ఇఫ్తార్ చేయించిన వారికి కూడ లభించును. అతని అన్ని పాపాలు క్షమించ బడును మరియు స్వర్గము లభించునని" కూడ ఇంకొక చోట తెలిపిరి. (మిష్కాత్)

## 15. రోజా యొక్క సంకల్పము

**"ఆచరణలన్నీ సంకల్పము పైననే ఆధారపడి ఉన్నాయి. ప్రతి మనిషికీ అతని ఉద్దేశ్యానికి అనుగుణంగానే ప్రతిఫలము లభిస్తుంది" అని మన ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి."** (బుఖారీ, ముస్లిమ్)

ప్రతి ఒక్కరూ తాను ఉపవాసముంటున్నానని సంకల్పము చేసుకోవాలి. కేవలము మనసు నందు సంకల్పము చేసికొనిన చాలును. కానీ పలుకులతో కూడ ఈ విధముగా రోజా సంకల్పము చేసికొనుట మంచిది. శ్రేష్ఠమైన రమజాన్ మాసపు ఉపవాసాల సంకల్పము రాత్రి యందు చేసికొనుట మంచిది. ఎవరైన రాత్రి పూట సంకల్పము చేసికొనుట మరచిపోయినచో మరుసటి రోజు మధ్యాహ్నమునకు 11/2 గంట పూర్వమే సంకల్పము చేసికొన వలయును.

**సంకల్పము: నవైతు అన్ అసూము హాజల్ యౌమ లిల్లాహి తఆలా మిన్ ఫర్జి రమజాన్.** (నేను ఈ రోజు రమజాను మాసపు ఫర్జ్ ఉపవాసపు సంకల్పము చేయుచున్నాను.)

## 16. సంకల్పపు సిద్ధాంతాలు

**1.** రమజాన్ మాసపు ఉపవాసము, రోజు నిర్ణయించు కొనిన వాజిబ్ ఉపవాసము, మరియు నఫిల్ ఉపవాసాల సంకల్పము మధ్యాహ్నమునకు పూర్వము వరకు చేసుకొన వచ్చును. ఇచ్చట మధ్యాహ్న మనగా ఉషోదయము నుండి సూర్యాస్తమయమునకు మధ్య అని అర్థము. ఈ మధ్య కాలము 14 గంటలయినచో, 7 గంటలకు ముందే సంకల్పము చేసుకో వలెను. కానీ రమజాన్ మాసపు ఖజా రోజాలు, కఫ్ఫారా రోజాలు, దినము నిర్ణయము

చేయని నఫిల్ రోజాల సంకల్పము ఉషోదయానికి పూర్వమే చేసుకొనుట తప్పని సరియై యున్నది. (బిహిష్తీజేవర్, (దీనియాత్ 2 యం, స.69)

**2.** రమజాన్ మాసపు ఉపవాసాలు, దినము నిర్ణయించు కొనిన వాజిబ్ ఉపవాసాలు సున్నత్ మరియు నఫిల్ ఉపవాసాలు – వాటి పేరును పలుకకుండ కేవలము ఉపవాసపు సంకల్పము చేసుకొనినను, అవి పూర్తి అగును. కానీ ఖజా వుపవాసాలు, కఫ్ఫారా (శిక్ష) ఉపవాసాలు, మరియు దినము నిర్ణయించని వాజిబ్ ఉపవాసాలలో వాటి పేరుతో బాటు ఉపవాస సంకల్పము చేసుకొనుట తప్పనిసరియై యున్నది. ఉదా: మ్రొక్కుబడి చేసుకొనిన కఫ్ఫారా ఉపవాసపు సంకల్పము లేదా ఫలానా సంవత్సరపు రమజాన్ ఉపవాసపు సంకల్పము చేయుచున్నాను అని సంకల్పము చేసుకోవాలి. ((బిహిష్తీజేవర్, దీనియాత్ 2యం, 70)

**3.** రమజాన్ మాసపు ప్రతి ఉపవాసమునకు విడివిడిగా సంకల్పము ప్రతిరోజు చేసుకొనుట తప్పనిసరియై యున్నది. ఉదాహరణమునకు "నేను ఈ రోజు రమజాన్ మాసపు ఫర్జ్ రోజా యొక్క సంకల్పము చేయు చున్నాను".

**4.** ఒక వేళ రాత్రి సమయములో గుస్ల్ చేయవలసిన అవసరము కల్గి, ఉషోదయానికి పూర్వము గుస్ల్ చేయలేని యెడల, అదే స్తితిలో సహరీ చేసి సంకల్పము చేసుకొని ఉపవాస ముండ వలెను. వీలైనంత త్వరగా గుస్ల్ ఆచరించి నమాజ్‌ను ఆచరించ వలెను. అనగా ఉపవాసపు సంకల్పము చేసికొనుటకొరకు గుస్ల్ స్నానము చేసి పరిశుద్ధతను పొందుట తప్పనిసరి కాదు, కానీ నమాజ్ కొరకు గుస్ల్ స్నానము చేసి పరిశుద్ధతను పొందుట తప్పనిసరియై యున్నది.

**5.** ఎవరైనా గుస్ల్ చేసి పరిశుద్ధత పొందవలసిన అవసరమైయున్న స్థితిలోనే ఉపవాసపు సంకల్పము చేసుకొని ఉపవాసముండి, ఆ రోజంతా గుస్ల్ చేయకున్నను, నమాజ్ ఆచరించకున్నను, అతని ఉపవాసము సంపూర్ణమగును. ఉపవాసముండని దోషము అతనికి కలుగదు. కానీ నమాజ్ విడిచిన పాపము అతనికి కలుగును. (ముస్లిమ్ ఖవాతీన్‌కె లియే 20 సబఖ్, స.30)

## 17. రమజాన్ మాసములో రోజహ్ పాటించకుండుటకు అనుమతింపబడిన పరిస్థితులు

**01.** ఇస్లామీయ షరీఅత్ ప్రకారము ప్రయాణీకుడు, ప్రయాణావస్థ యందు రోజా పాటించకుండుటకు అనుమతింప బడినది. కానీ ప్రయాణము నందు ఎలాంటి ఇబ్బంది, కష్టములు లేని యెడల రోజ ఉండుట ఉత్తమము. రమజాన్ మాసములో వదలివేసిన రోజాలను వీలైనంత త్వరలో ఖజా ఆచరించ వలెను.

**02.** వ్యాధి మూలముగా రోజా ఉండు శక్తి లేనియెడల, లేదా వ్యాధి తీవ్రరూపము దాల్చే భయమున్నప్పుడు.

**03.** రోజాలో ప్రాణాపాయము కలిగేటంతటి ఆకలి దప్పులు కలిగే వ్యక్తి.

**04.** గర్భవతులు మరియు పాలు త్రాపించే స్త్రీలు ఉపవాస ముండుటచే తమకు గానీ తమ పిల్లలకు గానీ నష్టము సంభవించునను బలమైన నమ్మకమున్నప్పుడు. (బిహిష్తీజేవర్, దీనియాత్ 2 యం స 70)

**నోట్:** పై అన్ని పరిస్థితులలోను, ఏకారణము మూలముగా రోజా ఉండకుండుట అనుమతింప బడినదో, ఆ కారణము అంతమైన వెంటనే ఖజా రోజాలు పాటించుట విధియై యున్నది.

**05.** ఋతుస్రావము (ముట్టు), నిఫాస్ (బాలింతకు వచ్చే రక్తము) పరిస్థితులలో రోజా ఉండుట తగదు. ఒక వేళ రోజా ప్రారంభించిన తరువాత హైజ్ గానీ నిఫాస్ గానీ వచ్చినచో రోజా భగ్నమగును. కానీ సూర్యుడు అస్తమించే వరకు రోజా పాటించు వారి వలె తినడం, త్రాగడం మానివేయుట తప్పనిసరియై యున్నది.

**06.** ఎవరైనా వృద్ధాప్యము మూలముగా రోజా పాటించే శక్తి లేకున్నను, భవిష్యత్తులో కూడ శక్తి కలిగే నమ్మకము లేనిచే అతను రోజా పాటించనవసరము లేదు. కానీ రోజాకు బదులుగా ఫిద్యా చెల్లించ వలెను. అనగా నిరుపేదలలో ఒకనికి సద్ఖయే ఫిత్ర్ (ఒక కిలో 570 గ్రాములు 640 మిల్లి గ్రాముల ధాన్యమును గానీ దాని వెల) ను చెల్లించ వలెను

లేదా ఉదయము, సాయంత్రము రెండు పూటలా కడుపు నిండా భోజనము పెట్ట వలెను. (ఈజాహుల్ మసాయిల్, స.101)

### సిద్ధాంతము

రోజ ప్రారంభించిన తరువాత, ప్రాణాపాయము కలుగుటంతటి తీవ్ర వ్యాధికి గురైనను లేదా తీవ్రమైన గాయమైనను, లేదా పాము గానీ తేలు గానీ కుట్టినను, రోజాను భంగ పరచుట తగును. తరువాత దాని ఖజా పాటించ వలెను. (బిహిష్తీజేవర్, దీనియాత్ 2 యం, స.70)

## 18. రోజా లో మక్రూ (అవాంఛనీయమైన) అంశాలు

ఉపవాసము పాటించేవారు కొన్ని విషయాల పట్ల జాగ్రత్త వహించాలి. వీటికి వారు దూరముగా ఉండకపోతే రోజా మక్రూ అవుతుంది. అనగా పుణ్య ఫలము తగ్గుతుంది. అవి:

**01.** రుచి లేని వస్తువును నోటిలో వేసి యుంచుట.

**02.** ఏదైనా వస్తువు యొక్క రుచి చూచుట. ఒకవేళ కోపిష్టి భర్త యున్నచో, అతనిభార్య నాలుక చివరి భాగంతో కూరలోని ఉప్పు రుచి చూచుటకు అనుమతి కలదు. కానీ రుచి గొంతు లోనికి వెళ్ళిన రోజా భగ్న మగును.

**03.** పుక్కలించు నపుడు, ముక్కులోనికి నీరు ఎక్కించు నపుడు హద్దుమీరుట.

**04.** నోటి యందు ఎంగిలిని అధికముగా కూడబెట్టి మ్రింగుట.

**05.** చాడీలు చెప్పుట, అపద్ధమాడుట, తిట్టుట మొదలగు చేష్టల వలన.

**06.** రోజా మూలముగా అసౌకర్యాన్ని, అసహనమును వ్యక్తపరచుట.

**07.** గుస్ల్ చేయవలసిన పరిస్థితి కలిగినపుడు, గుస్ల్ చేయుటలో ఆలస్యము చేయుట.

**08.** పళ్ళపొడి, లేదా టూత్‌పేస్ట్‌తో పళ్ళు తోముట. మన్‌జన్ లేక టూత్‌పేస్ట్ యొక్క రుచి గొంతు లోనికి వెళ్ళినచో రోజా భగ్నమగును. (బిహిష్తీజేవర్, దీనియాత్ 2 యం, స.71)

## 19. రోజహ్ ను భగ్నమయ్యే పరిస్థితులు

తప్పనిసరి పరిస్థితులలో తప్ప రోజాను భగ్న పరచుట మహాపాపము. రోజాను భంగపరిచే పరిస్థితులు రెండు విధాలు. 01. కేవలము ఖజా(బదులు) రోజా పాటించడం తప్పనిసరి చేసే పరిస్థితులు. 02. ఖజా మరియు కఫ్ఫార (పరిహారము) చెల్లించుట తప్పనిసరి చేసే పరిస్థితులు (బిహిష్తీజేవర్, 3/10, దీనియాత్ 2 యం, /71)

### 19.1. కేవలము ఖజా (బదులు) రోజా పాటించడం తప్పనిసరి చేసే పరిస్థితులు.

**01.** ఎవరైనా బలవంతముగా రోజా ఉన్న వ్యక్తికి ఏదైనా తినిపించినపుడు, అది గొంతు క్రిందికి వెళ్ళినపుడు.

**02**. రోజ గుర్తుండియు పుక్కిలించేటప్పుడు నీరు గొంతు లోపలికి వెళ్ళినప్పుడు. (ఇమ్దాదుల్ ఫతావా, జి. 2. స.136)

**03.** వాంతి కలిగిన తెలిసికూడ దానిని మ్రింగి వేసినపుడు. (దానంతట అదే లోనికి వెళ్ళిన రోజా భగ్నము కాదు)

**04.** కావాలని నోటినిండా వాంతి చేసుకొనుట.

**05**. ఆహారముగా ఉపయోగంచని వస్తువులను కావాలని మ్రింగినపుడు. ఉదా: గులకరాళ్ళు, టెంక, రబ్బర్, లేక ఏదైనా రుచిలేని వస్తువు.

**06.** పళ్ళలో యున్న పదార్థమును నాలుకతో తీసి మ్రింగుట. ఆపదార్థము చెనిగి పప్పు పరిమాణములో యున్నచో రోజా భగ్నమగును. దానికన్నా తక్కువ పరిమాణములో యున్న రోజా భగ్నము కాదు. కానీ చెనిగి పప్పు కన్నా తక్కువ పరిమాణము గల వస్తువు నోటినుండి బయటకు తీసి మరల మ్రింగిన రోజా భగ్నమగును.

**07.** ముక్కు లేక చెవులలో నూనె లేక మందు వేయుట.

**08.** ఏదైనా వస్తువును ముక్కు ద్వారా కడుపు లోనికి గాని మెదడుకు గాని చేరునట్లు చేయుట. ఉదా: నశ్యము (ముక్కుపొడి) పీల్చుట.

**09.** నోటిలో ఎంగిలి కన్నా రక్తము అధికముగా యున్నప్పుడు పళ్ళ నుండి వచ్చిన రక్తమును మ్రింగుట.

**10.** మరచిపోయి యేదైనా తినిన తరువాత రోజా భగ్నమైపోయినదని భావించి తినడం త్రాగడం వలన.

**11.** ఉషోదయము కాలేదని భావించి సహరీ భుజించిన పిమ్మట ఉషోదయము తరువాత సహరీ భుజించినట్లు తెలిసి నప్పుడు.

**12.** ఆకాశము మేఘాలతో గాని దుమ్ముతో గాని కప్పబడి యుండి నపుడు సూర్యాస్తమయము (ఇఫ్తార్ సమయము) అయినదని భావించి ఇఫ్తార్ చేసిన తరువాత సూర్యుడు అస్తమించ లేదని తెలిసి నప్పుడు. (దీనియాత్ 2యం,స.71)

**13.** ఉపవాసి హుఖ్ఖా లేక బీడీ తాగినపుడు. రోజా భగ్న మగును. (ఇమ్‌దాదుల్ ఫతావా, 1/131)

**14.** ఉపవాసి భార్యను ముద్దిడుట వలన గాని కలిసి పండుకొనుట వలన గాని సంభోగము చేయక పోయినను వీర్యము (మనీ) వెలువడి నప్పుడు. (రోజా భగ్న మగును) (ఫతావా దారుల్ ఉలూమ్, జి. 4,స. 440)

## 19.2. ఖజా మరియు కఫ్ఫార - రెండును తప్పనిసరి అగు పరిస్థితులు

**01.** రమజాన్ నెలలో ఉపవాసముండి, ఆహార పానీయాలు, లేక మందు, లేక రుచికరమైన పదార్థములు తెలిసి కూడ సేవించుట.

**02.** రోజ గుర్తుండి కూడ సంభోగము చేయుట.

**03.** రక్తము తీయుట వలన గానీ సుర్మా పెట్టుకొనుట వలన గాని రోజా భగ్న మై పోయినదని భావించి తెలిసి కూడ తినడం, త్రాగుట వలన. (బిహిష్తీజేవర్, 3/17, దీనియాత్ 2యం, స. 72)

### ముఖ్య గమనిక

**01**. రమజాన్ నెలలో ఆచరించే రోజాలను భంగ పరచినప్పుడు మాత్రమే కఫ్ఫార చెల్లించుట తప్పని సరి యగును. ఇవి తప్ప మిగిలిన రోజాలు, రమజాన్ ఖజా రోజాలైనా సరే, భంగ పరచిన కఫ్ఫార చెల్లించ వలసిన పని లేదు.

**02.** పవిత్ర రమజాన్ నెలలో ఏదైనా కారణముగా రోజా భంగమైన వ్యక్తి, ఆహార పానీయాలు ఏవియు సేవించకుండా ఉపవాసి వలె ఇఫ్తార్

సమయము వరకు ఉండవలెను. ఇదే విధముగా ప్రయాణీకుడై నందున ఉపవాసమాచరించక పగలు స్వస్థలానికి చేరినను, ఏదైనా కారణముచే ఉపవాసముండని వారు ఆకారణము తొలగినను, పిచ్చివాడు స్వస్థత పొందినను, ఇఫ్తార్ సమయము వరకు ఎటువంటి ఆహార పానీయాలు సేవించకుండా యుండుట తప్పనిసరి. (దీనియాత్ 2 యం,స73)

## 20. రోజహ్‌ను భంగపరచని పరిస్థితులు

**01.** ఉపవాసి మరచిపోయి ఆహార పానీయాలు సేవించినను, మరచిపోయి భార్యతో సంభోగము చేసినను, తరువాత గుర్తు వచ్చినను, అతని రోజా భంగం కాదు. (బిహిష్తీ సమర్, హిస్స 2. స.11)

**(రోజాలో మరచిపోయి చేసిన కార్యము క్షమించ బడును.** రోజాలో మరచిపోయి తిన్నను లేక రోజాను భంగ పరిచే కార్యము మరచిపోయి ఆచరించినను అది క్షమించబడును. అతని రోజా సక్రమమే అగును. కానీ నమాజ్ మరియు హజ్‌లో మరుపు క్షమించ బడదు. (ఫతావారహీమియా,2/46)**)**

**02.** పగలు నిద్రపోయినపుడు "కల" మూలముగా వీర్య స్ఖలనము కలిగినను (గుస్ల్ చేయవలసిన పరిస్థితి ఏర్పడినను)రోజా భంగము కాదు. (బీహిష్తీ స,2/11)

**03.** పగలు సుర్మా పెట్టుట, నూనె రాయుట, సువాసన పీల్చుటలో ఎటువంటి లోపము లేదు. వీని వలన రోజా భంగము కాదు. (బీహిష్తీ సమర్, హిస్స 2. స.11)

**04.** నరాల ద్వారా కాని చెమట వెలువడే రంధ్రాల ద్వారా గాని ఏదైనా ఉపవాసి కడుపులోనికి ప్రవేశించినచో రోజా భగ్నము కాదు. కాబట్టి ఇంజెక్షను తీసుకొనుటచే రోజా భగ్నము కాదు. (ఫతావా మహ్మూదియా, జి.3, స.143)

**05.** ఉపవాస స్థితిలో పుండ్లు, మొటిమలపై మందు రాయ వచ్చును. కాని రంధ్రము ద్వారా లోనికి వెళ్ళునట్లు చేయుట తగదు(ఫతావా దారుల్ ఉలూమ్, 6./411)

**06.** కంటియందు మందు వేయుట వలన కాని సుర్మా పెట్టుట వలన కాని ఉపవాసమునకు ఎటువంటి చెడు కలుగదు. (దుర్రె ముఖ్‌తార్, కరాచి, జి.2. స.395)

**07.** తీవ్రమైన వ్యాధి కారణముగా నోటిలో మందు రాసినచో ఎటువంటి ఆటంకము

లేదు. అనవసరముగా మందు రాసినచో మక్రూ అగును. (దుర్రె ముఖ్తార్, కరాచీ)

**08.** ఉపవాస స్థితియందు చెవిలో నూనె గాని మందు గాని వేసినచో ఉపవాసము భగ్న మగును. కాని చెవిలో నీళ్ళు పోయినచో ఉపవాసము భగ్నము కాదు. (బిహిష్తీ జేవర్, జి.3, స.12)

**09.** ముక్కులో మందు గాని నీరు గాని పోసినచో ఉపవాసము భగ్న మగును. ఇదే విధముగా గొంతులో పోసినను ఉపవాసము భగ్న మగును. కాబట్టి గుస్ల్ (తలస్నానము) లో గరగర చేయునప్పుడు, ముక్కులో నీరు ఎక్కించు నపుడు హద్దు మీరి ప్రయత్నించరాదు. (ఫతావా దారుల్ ఉలూమ్, జి.6, స.416)

**10.** పంటి చిగుళ్ళ నుండి రక్తము కారి గొంతులో ప్రవేశించినప్పుడు, రక్తము ఎంగిలితో సమానంగా గాని లేక ఎంగిలికన్నా ఎక్కువగా కానీ యుండి గొంతులో రక్తపు రుచి కలిగినయెడల ఉపవాసము భంగ మగును. రక్తము తక్కువగా యుండిన యెడల ఉపవాసము భంగము కాదు. (దుర్రె ముఖ్తార్, కరాచి, జి. 2, స.437)

**11.** మిస్వాక్ చేయునపుడు దాని పీచు కడుపులోనికి పోయినచో ఉపవాసము భంగము కాదు. (అహ్సనుల్ ఫతావా, జి.4. స.435)

**12.** ఉపవాస స్థితిలో పళ్ళ పొడి, టూత్ పేస్ట్ మొదలగునవి వాడుట మక్రూ అగును. వీటి నుండి జాగ్రత వహించాలి. వీటికి దూరముగా ఉండాలి. (అహ్సనుల్ ఫతావా, జి. 4. స.429)

**13.** పోస్టు కవరు యొక్క బంకను నాలుకతో నాకి ఊసివేసిన తరువాత ఎంగిలిని మింగినచో ఉపవాసము భంగము కాదు. ఎంగిలి ఊసివేయకనే మింగిన ఉపవాసము భంగమగును. (దుర్రె ముఖ్తార్, కరాచీ, జి.2, స.416)

**14.** సాంబ్రాణి, సాంబ్రాణి వత్తులు మొదలగు వానిని కాల్చి దగ్గర ఉంచుకొని దాని వాసనను పీల్చు చుండిన రోజ భంగమౌతుంది. కానీ అనుకోకుండా, అప్రయత్నంగా వాసన, పొగ లోనికి వెళ్ళినచో రోజ భంగము కాదు. (దుర్రె ముఖ్తార్, జి.3,స.395)

**15.** ఉపవాస స్థితిలో రక్తము తీయించిన రోజా భంగము కాదు. కానీ రక్తము

తీయుటచే బలహీనత కల్గి రోజా ఉండుటకు శక్తి లోపించిన యెడల రక్తము తీయుట మక్రూ అగును. (అహ్సనుల్ ఫతావా, జి. 4. స.425)

**16.** ఉపవాస స్థితిలో తప్పనిసరియైనచో, పళ్ళు పీకించుకో వచ్చును. అనవసరముగా పళ్ళు పీకించినచో మక్రూ అగును. (అహ్సనుల్ ఫతావా, జి. 4. స.426)

**17.** ఉపవాస స్థితిలో స్త్రీలు పెదాలపై ఎర్రని రంగు పూసుకొనిన, ఉపవాసములో ఎటువంటి లోటు కలుగదు. కాని నోటి లోపలికి వెళ్ళే ప్రమాదమున్నచో ఎర్ర రంగు పూయుట మక్రూ అగును. (అహ్సనుల్ ఫతావా,జి.4. స.424)

**18.** "భావోద్రేకాలు అదుపులో ఉంటాయన్న నమ్మకముంటే, ఉపవాస స్థితిలో భార్యను కౌగిలించుకొన వచ్చును." (అబూదావూద్) వీర్య స్ఖలనము లేక సంభోగ కాంక్ష యొక్క భయము లేనిచో, ఉపవాస స్థితిలో భార్యను ముద్దిడినను, పక్కన పరుండినను ఎటువంటి దోషము లేదు. వీర్య స్ఖలనము లేక సంభోగ కాంక్ష కలిగే భయమున్నచో, భార్యను ముద్దిడుట, పక్కన పరుండుట మక్రూహె తహ్రీమి అగును. కాబట్టి ముసలివారు భార్యను ముద్దిడుట, పక్కన పరుండుటలో ఎటువంటి తప్పులేదు. కానీ యుక్త వయస్కులు మనస్సును అదుపులో యుంచుకోలేరు కనుక వారు భార్యను ముద్దిడుట, పక్కన పరుండుట మక్రూహె తహ్రీమి అగును. కావున అట్లు చేయుట తగదు. (దుర్రె ముఖ్తార్ కరాచి, జి. 2, స.417)

**19.** భార్యను ముద్దిడుటచే కేవలము మజీ(సంభోగ కాంక్ష వలన వెలువడే ద్రవము) వెలువడినచో, దాని వలన రోజా లో ఎటువంటి లోటు కలుగదు. (అహ్సనుల్ ఫతావా,జి.4.స.441)

**20**. అనుకోకుండా అందమైన స్త్రీను చూచి, ఆమెను గురించే ఆలోచించు చుండినపుడు, వీర్యస్ఖలనము అయినను ఉపవాసము భంగము కాదు. కానీ స్రీలను చూచినపుడు, వారిని గురించి ఆలోచించుట తగదు. (దుర్రె ముఖ్తార్, కరాచీ, జి.2. స.401)

## 21. ఫిదియా (పరిహారము)

మిక్కిలి వృద్ధులైన వారు లేక తీవ్ర వ్యాధిగ్రస్తులై ఆరోగ్య వంతులయ్యే

ఆశలేని వారు, ఉపవాసము పాటించే శక్తి లేనప్పుడు, ప్రతి ఉపవాసమునకు బదులుగా ఫిదియా (పరిహారము) తప్పనిసరిగా చెల్లించ వలసి యుంటుంది. ఒక వ్యక్తి ఒక ఉపవాసానికి బదులు ఒక ఫిత్రాకు సరిపడు నంతటి ధాన్యమును ఒక పేదవానికి దానము చేయవలసి యుంటుంది. లేదా ఉదయము మరియు సాయంత్రము ఒక పేదవానికి కడుపునిండ భోజనము పెట్టవలసి యుంటుంది. దీనిని షరీఅత్‌లో ఫిద్య (బదులు) అందురు.

నేటి కొలతల ప్రకారము ఒక కిలో 574 గ్రాముల 640 మిల్లి గ్రాములు (గ్రా. 1574.640 మి.గ్రా) ఒక ఫిత్ర్ దానముగా పరిగణింప బడుచున్నది. (ఈజాహుల్ మసాయిల్, స. 101)

## ఫిదియా సిద్ధాంతములు

**01.** ఒక ఉపవాసపు ఫిద్య (బదులు) కొంతమంది పేదలకు ఇవ్వ వచ్చును. ఇదే విధముగా కొన్ని ఉపవాసాల ఫిద్య ఒకే పేదవానికి ఇవ్వ వచ్చును. (ఫతావా రహీమియా,5/198)

**02.** 'షేఖె ఫానీ' అనగా మిక్కిలి వృద్ధులైన వారు ఉపవాసము పాటించే శక్తి లేనప్పుడు, తరువాతి కాలములో కూడ ఉపవాసముందు శక్తిని పొందే ఆశ లేనప్పుడు, ఉపవాసమునకు బదులు (ఫిద్య) చెల్లించుట తగును. (ఫతావా దారుల్ ఉలూమ్, జి.6, స.482)

**03.** బలహీనులైన గర్భవతులు లేక వ్యాధిగ్రస్తులు ఉపవాసపు ఫిదియ ఇచ్చిన సరిపోదు. ఫిదియ ఇచ్చినప్పటికి ఆరోగ్యవంతులైన తరువాత ఉపవాస ముల ఖజా పాటించడం వాజిబ్(తప్పనిసరి)యై యున్నది. (ఫతావా దారుల్ఉలూమ్, జి.6, /478)

## 22. ఉపవాసపు కఫ్ఫార (పరిహారము, శిక్ష)

పాపమునకు బదులు అల్లాహ్ నిర్ణయించి పరిహారమును, శిక్షను కఫ్ఫార అందురు. కఫ్ఫారతో పాపములు కడిగివేయ బడతాయి. ఉపవాసము యొక్క కఫ్ఫార ఒక బానిసను విడిపించుట (స్వతంత్రుని జేయుట) ఇది కానిచో రెండు నెలలు ఎడతెరిపి లేకుండ ఉపవాస ముండుట. ఇది కూడ వీలుకానిచో 60 మంది పేదలకు రెండు పూటలా కడుపు నిండ భోజనము పెట్టవలెను. లేకపోతే

ఒక్కొక్కరికి సదఖయె ఫిత్ర్ పరిమాణములో (1 కిలో, 574 గ్రామ్, 640 మిల్లిగ్రామ్) ధాన్యమును 60 మందికి ఇవ్వవలెను. లేదా దాని విలువను చెల్లించ వలెను. (బిహిష్తీజేవర్, 3/15, దీనియాత్ 2యం, స.73)

## 23. తరావీహ్ నమాజ్

పవిత్రమైన రమజాన్ నెలలో ఇషా నమాజ్ యొక్క ఫర్జ్ మరియు సున్నత్ నమాజ్‌లు ఆచరించిన తరువాత విత్ర్ నమాజ్‌కు ముందు ఆచరించే నమాజ్‌ను తరావీహ్ నమాజ్ అందురు. దీని వేళ ఇషా నమాజ్ తరువాత నుండి ఉషోదయం వరకు ఉంటుంది.

యుక్త వయస్కులైన ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ తరావీహ్ నమాజ్‌ను ఆచరించుట "సున్నతె ముఅక్కద" (మన ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ తప్పకుండ ఆచరించిన పనులు). కాబట్టి సమర్థనీయమైన కారణం లేకుండా, కావాలని తరావీహ్ నమాజ్‌ను ఆచరించనివాడు అపరాధి అవుతాడు. పవిత్ర రమజాన్ నెలపొడుపు కనపడిన రాత్రి నుండి తరావీహ్ నమాజ్ ఆచరించుట ప్రారంభం అవుతుంది. రమజాన్ పండుగ నెలపొడుపు(షవ్వాల్ నెలవంక) కనపడే వరకు ఆచరించ బడుతుంది. (దీనియాత్ 5 బిజి స.104)

### గమనిక

అల్లాహు తఆలా నుండి లభించే పరలోక పుణ్యఫలాలపై నమ్మక ముంచి, క్రమము తప్పకుండా తరావీహ్ నమాజ్‌ను శ్రద్ధా భక్తులతో ఆచరించిన విశ్వాసి యొక్క పూర్వపు సమస్త పాపాలను అల్లాహు తఆలా క్షమించివేస్తాడు. (తిర్మిజీ, 1/84)

### 23.1. తరావీహ్ నమాజ్ ఆచరించే పద్ధతి

పవిత్రమైన రమజాన్ మాసంలో ఇషా యొక్క ఫర్జ్ మరియు సున్నత్ నమాజ్‌లు ఆచరించిన తరువాత, తరావీహ్ నమాజ్ కొరకు సంకల్పం చేసుకొని, రెండేసి రకాతుల చొప్పున, పది సలాములతో 20 రకాతుల నమాజ్‌ను ఆచరించ వలెను. ప్రతి నాలుగు రకాతుల తరువాత కొంత సేపు కూర్చొని విశ్రాంతి తీసుకోవలెను. ఆ విశ్రాంతి సమయంలో కూడా మౌనంగా దైవనామ స్మరణం చేయడం మంచిది. (దీనియాత్ 5 బిజి స. 104)

రమజాన్ నెలంతా ఆచరించే తరావీహ్ నమాజ్‌లో పవిత్ర ఖుర్ఆన్‌ను సంపూర్తిగా పఠించుట సున్నత్ అయి యున్నది. కానీ తమ శక్తి కొలది అనేక సార్లు పవిత్ర ఖుర్ఆన్‌ను సంపూర్తిగా చదివిన మరీ మంచిది. (దీనియాత్ 5 బిజి స. 104)

ఇషా నమాజ్ ఆచరించే సమయమందే తరావీహ్ నమాజ్ కూడ ఆచరించ బడుతుంది. కానీ తరావీహ్ నమాజ్, ఇషా నమాజ్‌కు అనుబంధమగుటచే ఇషా ఫర్జ్ నమాజ్‌కు ముందు తరావీహ్ నమాజ్ అచరింపబడదు. కాబట్టి ఎవరైనా తరావీహ్ నమాజ్ ప్రారంభమైన తరువాత మసీదుకు వెళ్ళినచో, ముందు ఇషా ఫర్జ్ ఆచరించి, తరువాత తరావీహ్ నమాజ్ జామాత్‌లో పాల్గొనాలి. (దీనియాత్ 5 బిజి స. 104)

## మసాయిల్ (సిద్ధాంతాలు)

**01.** ఇషా నమాజ్ జమాత్‌తో ఆచరించని వ్యక్తి, ఇషా ఫర్జ్ ఆచరించిన తరువాత, తరావీహ్ నమాజ్ జమాత్‌తో అచరించ వచ్చును.

**02.** ఆలస్యంగా తరావీహ్ నమాజ్‌లో పాల్గొనిన వ్యక్తి, ఇమామ్‌గారితో విత్ర్ నమాజ్ ఆచరించిన తరువాత తప్పిపోయిన తరావీహ్ నమాజ్‌ను ఆచరించాలి. (దీనియాత్ 5 బిజి స.104)

## 24. రమజాన్ నెలలో ఖుర్ఆన్ పారాయణము

**"మన ప్రవక్త హ(జత్ ముహమ్మద్** సల్లల్లాహు అలైహి వ సల్లం **గారు రమజాన్ నెలలో అందరికన్నా ఎక్కువగా దానధర్మాలు చేసేవారు. ప్రతిరోజు రాత్రి జిబ్రాఈల్ దూతకు ఖుర్ఆన్ పారాయణము చేసి వినిపించేవారు. జిబ్రాఈల్ అలైహిస్సలామ్ కూడ మన ప్రవక్త హ(జత్ ముహమ్మద్** సల్లల్లాహు అలైహి వ సల్లం **గారికి ఖుర్ఆన్ వినిపించేవారు."** (బుఖారీ, ముస్లిమ్)

కాబట్టి మనము కూడ రమజాన్ నెలలో అత్యధికముగా ఖుర్ఆన్ పారాయణము చేయవలయును.

## 25. రమజాన్ నెలపొడుపును చూసి చదివే దుఆలు

**అల్లాహు అక్బర్, అల్లాహుమ్మ అహిల్లహూ అలైనా బిల్ యుమ్‌ని వల్ ఈమాని వస్సలామతి వల్ ఇస్లామి వత్తౌఫీఖి లిమా తుహిబ్బు వతర్‌జా వ రబ్బీ**

వ రబ్బుకల్లాహ్. ...(తిర్మిజీ)

**అర్థం:** అల్లాహు తఆలా అందరి కంటే గొప్పవాడు. ఓ అల్లాహ్! నీకు ఇష్టమైన, నీవు ఇష్టపడే 'శ్రేయో శుభాలు, విశ్వాసము, శాంతి సౌభాగ్యాలు, ఇస్లామ్ మరియు దాని ఆచరణ మార్గదర్శనము'తో ఈ చంద్రుని ఉదయింప జేయుము. ఓ చంద్రుడా! నాయొక్క మరియు నీ యొక్క (మనిద్దరి)పోషకుడు ఔన్నత్యముగల అల్లాహ్ యే.

## 26. శుభకరమైన రమజాన్ నెలలో చదువ వలసిన శ్రేష్ఠమైన దుఆలు

### 26.1. సహ్‌రీలో చదివే దుఆ

**యా వాసి అల్ మగ్ఫిరహ్ –** ఓ అత్యధికముగా క్షమించువాడా !(ఓ అల్లాహ్ ! నన్ను క్షమించుము)

### 26.2. ఉపవవాస స్థితియందు

"ఉపవాస స్థితి యందు తిట్టుట, పోట్లాడుట, కొట్లాడుట మొదలగునవి చేయకుము. ఎవరైనా మిమ్ములను తిట్టినను, మీతో పోట్లాడినను, ఆయనతో మీరు **"ఇన్నీ సాయిమున్"**– (నేను ఉపవాసమున్నాను) అని రెండసార్లు పలుకమని" రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. ...(బుఖారి)

### 26.3. అస్ర్ నుండి మగ్రిబ్ వరకు చదువే దుఆ

**యా వాసిఅల్ ఫజ్లి ఇగ్ఫిర్ లీ –** ఓ అత్యధికముగా అనుగ్రహించువాడా! నన్ను క్షమించుము.

### 26.4. పవిత్రమైన రమజాన్ నెలలో అత్యధికముగా చదువ వలసిన దుఆలు

01. **లాఇలాహ ఇల్లల్లాహు అస్తగ్ఫిరుల్లాహ, అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్ జన్నత వ అఊజుబిక మినన్నార్.** (అల్లాహ్ తప్ప మర్వెరూ ఆరాధనా యోగ్యులు లేరు. నేను అల్లాహ్‌తో క్షమాపణ వేడుచున్నాను. ఓ అల్లాహ్! నేను స్వర్గమును కోరుచున్నాను, నరకాగ్ని నుండి నీ శరణు (రక్షణ) కోరుచున్నాను.

02. **అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుక రిజాక వ జన్నతక వ అఊజుబిక మిన్ గజబిక, వన్నార్.**(ఓ అల్లాహ్! నేను నీ అభీష్టమును (ఇష్టాన్ని), మరియు స్వర్గమును ప్రార్థించు చున్నాను. మరియు నీ ఆగ్రహము (కోపము) నుండి మరియు నరకము నుండి నీ శరణు వేడుచున్నాను)

03. దరూదె షరీఫ్

## 26.5. రమజాన్‌లో 1-10 వ రోజు వరకు పఠించ వలసిన దుఆ

**అల్లాహుమ్మర్‌హమ్‌నీ యా అర్‌హమఱ్ఱాహిమీన్.** (కరుణించేవారిలో కెల్లా మిక్కిలి కరుణించే వాడా! ఓ అల్లాహ్! నాపై కరుణించుము)

## 26.6. రమజాన్‌లో 11 - 20 వ రోజు వరకు పఠించ వలసిన దుఆలు

01. **అల్లాహుమ్మగ్‌ఫిర్‌లీ జునూబీ యా రబ్బల్ ఆలమీన్.** (ఇహ పరలోకాలకు ప్రభువైన ఓ అల్లాహ్! నా పాపములను క్షమించుము.)

02. **రబ్బిగ్‌ఫిర్ వర్‌హమ్ వ అన్‌త ఖైరు ర్రాహిమీన్.** (ఓ అల్లాహ్! నన్ను క్షమించుము, మరియు నాపై కరుణించుము, నీవే అత్యధికముగా కరుణించు వాడవు.)

## 26.7. 21 వ రోజు నుండి చివరి వరకు పఠించ వలసిన దుఆ

**అల్లాహుమ్మ అతిఖ్‌నీ మినన్నారి వ అద్‌ఖిల్‌నీ ఫిల్ జన్నతి యా రబ్బల్ ఆలమీన్** (ఇహ పరలోకాలకు ప్రభువైన ఓ అల్లాహ్! నన్ను నరకాగ్ని నుండి కాపాడుము మరియు స్వర్గ ప్రవేశమును ప్రసాదించుము)

## 26.8. ఇఫ్తార్ సమయపు దుఆ

**అల్లాహుమ్మ లక సుమ్‌తు వ అలా రిజ్‌ఖిక అఫ్‌తర్‌తు ..**(అబూదావుద్) (ఓ అల్లాహ్! నిన్ను ప్రసన్నుని చేయుట కొరకు నేను ఉపవాసముంటిని. నీవు ప్రసాదించిన ఆహారముతో నేను ఉపవాసము విరమించితిని. (విరమించు చున్నాను))

## 26.9. ఇఫ్తార్ తరువాతి దుఆలు

1. **జహబ జ్జమవు వబ్‌తల్లతిల్ వురూఖు వ సబతల్ అజ్‌రు ఇన్‌షా అల్లాహ్. ...**(అబూదావుద్) (దాహము తీరినది. నరాలు ఉల్లాసమును పొందినవి. (కళకళలాడినవి)

అల్లాహ్ తలచినచో పుణ్య ఫలము కూడ నిజపరుప బడినది.) (పుణ్య ఫలము లభించును)

**2. అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక బి రహ్మతికల్లతీ వసిఅత్ కుల్ల షయ్యిన్ అన్ తగ్ఫిజీ లీ జునూబీ. ..**(అబూదావుద్, ఇబ్నెమాజ) (ఓ అల్లాహ్! ప్రతి వస్తువును ఆవరించియున్న నీ కరుణ కటాక్షాల మూలముగా నిన్ను ప్రార్థించు చున్నాను – నీవు నా సమస్త పాపాలను క్షమించుము.)

## 26.10. ఇతరుల చెంత ఇఫ్తార్ చేసిన పఠించు దుఆ

**అఫ్తర ఇన్దకుముస్సాయిమూన వ అకల తఆమకుముల్ అబ్రారు వసల్లత్ అలైకుముల్ మలాయికహ్** (అబూదావుద్, ముస్లిమ్) (ఉపవాసులు మీ చెంత ఉపవాసమును విరమించిరి. సజ్జనులు మీ ఆహారమును భుజించిరి. అల్లాహ్ దూతలు (ఫరిష్తాలు) మీ కొరకు దుఆ (వేడుకోలు) చేసిరి. (అల్లాహ్ అనుగ్రహముతో, ఇదే విధముగా ఉపవాసులు మీ చెంత ఇఫ్తార్ విందు ఆరగిస్తూ యుండాలి, సజ్జనులు మీ ఆహారమును భుజిస్తూ యుండాలి, అల్లాహ్ దూతలు మీ కొరకు కరుణా కటాక్షాల ప్రార్థన చేస్తూ యుండాలి)

# 27. ఇత్తికాఫ్ యొక్క వివరణ

## 27.1. ఇత్ తి కా ఫ్

ఐదు వేళల సాముహికముగా (జమాఅత్తో) నమాజ్ జరుగు మసీదు నందు ఆరాధనా సంకల్పముతో కొన్ని ప్రత్యేక నియమ నిబంధనలతో ఉండుటను ఇత్తికాఫ్ అందురు. ఇత్తికాఫ్ వ్రతాన్ని ఆచరించువారిని ముత్తకిఫ్ అని, వారు కూర్చొను ప్రదేశాన్ని ముత్కఫ్ అని అందురు. (బిహిష్తీజేవర్, 3/21, దీనియాత్ 2యం/73)

ఏకైక ఆరాధ యోగ్యుడైన అల్లాహ్ గృహము (మసీదు) యందు యుండి, ఆయనను ఆరాధించుచు, ఆయన నామ స్మరణ చేయుచు, ఆయన గ్రంధ పారాయణము చేయుచు ఇహలోక సమస్త కార్యకలాపాలకు దూరమై కాలము గడుపుటయే ఇత్తికాఫ్ యొక్క ముఖ్య ఉద్దేశ్యము. స్త్రీలు మస్జిద్కు బదులు తమ ఇంటి యందే ఇత్తికాఫ్ ఆచరించ వలెను.

పవిత్ర రమజాన్ నెల చివరి పది రోజులు ఇత్‌తికాఫ్ పాటించుట "సున్నతె ముఅక్కదయె కిఫాయా" అవుతుంది. అనగా గ్రామము లేక వాడలోని కొందరు ముస్లింలు అయినా ఈ సంప్రదాయాన్ని పాటిస్తే, అది అందరి తరపున పాటించినట్లవుతుంది, ఏ ఒక్కరూ పాటించక పోతే ఆ గ్రామ ప్రజలందరూ పాపాత్ములవుతారు.

## 27.2. ఇఅ్‌తికాఫ్ - ఘనత, విశిష్ఠత

**01.** "అల్లాహు తఆలాను ప్రసన్నుని చేసుకొనుటకు ఎవరైన ఒకరోజు ఇత్‌తికాఫ్ ఆచరించినను, అల్లాహు తఆలా ఆయనకు నరకమునకు మధ్య మూడు కందకములు (అగడ్తలు) అడ్డుగా నిర్మిస్తాడు. ఒక్కొక్క కందకము యొక్క వెడల్పు భూమ్యాకాశాల మధ్య యున్న దూరము కన్నా ఎక్కువగా యుండును" అని మన ప్రవక్త హ్రజత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (త్బ్రాని అవ్‌సత్)

**02.** "ఎవరైన రమజాన్ నెలలో 10 రోజుల ఇత్‌తికాఫ్ ఆచరించిన, అది రెండు హజ్‌లు, రెండు ఉమ్రాలు ఆచరించిన దానితో సమానమని" మన ప్రవక్త హ్రజత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (ఖుత్‌బాతుల్‌అహ్‌కామ్)

**03.** "ఇత్‌తికాఫ్ ఆచరించు వారు పాపాల నుండి రక్షింపబడతాడు. అంతేగాక ఇత్‌తికాఫ్ మూలముగా ఏయే పుణ్యకార్యాలు చేయలేరో, వాటి పుణ్యఫలము కూడ వారికి ఆ పుణ్యకార్యాలు ఆచరించు వారికి కలుగు విధముగానే లభించునని" ఒక హదీసులో తెలుపబడి యున్నది. (ఇబ్నె మాజ)

**04.** అల్లాహు తఆలా, తనతో సన్నిహిత సంబంధము ఏర్పరచు కొనుటకు మరియు దానిని పటిష్టము చేయుట కొరకు తనదాసులకు ఇత్‌తికాఫ్‌ను ఆచరించుటకు ఆజ్ఞాపించెను. మన ప్రవక్త హ్రజత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు ప్రతి సంవత్సరము నిష్టతో రమజాన్ నెల చివరి 10 రోజులు ఇత్‌తికాఫ్ ఆచరించేవారు. పరలోక శ్రేయస్సును కోరి ఇత్‌తికాఫ్ ఆచరించుట చాల పుణ్య కార్యము.

**05.** ఇత్‌తికాఫ్ ఆచరించు వాడు తన సమస్త శరీరము మరియు సమస్త సమయము అల్లాహ్ యొక్క ఆరాధన కొరకు త్యాగము (అంకితము) చేయుచున్నాడు.

**06.** ఇత్‌తికాఫ్ వలన హృదయం నిర్మలమవుతుంది. పరలోక చింతన పటిష్టమవుతుంది. దేవుని సాన్నిధ్యం ప్రాప్తమవుతుంది.

**07.** ఇత్‌తికాఫ్ ఆచరించువారు ప్రాపంచిక కార్యాలు మరియు అనేక పాపకార్యాల నుండి రక్షింపబడుతారు.

**08**. అల్లాహు తఆలాను మెప్పించుటయే ఇత్‌తికాఫ్ ఆచరణ యొక్క ముఖ్య ఉద్దేశ్యము. ఇత్‌తికాఫ్ ఆచరించువారు అన్నివేళల నమాజ్ మరియు జమాత్ (సామూహిక నమాజ్) కొరకు ఉత్సాహముతో ఎదురు చూస్తూ కూర్చొని యుంటారు. కావున వారికి అన్ని వేళల నమాజ్ యొక్క పుణ్యము లభించును.

**09.** ముత్‌తకిఫ్ (ఇత్‌తికాఫ్ ఆచరించువ్యక్తి) ఇత్‌తికాఫ్ స్తితి యందు అల్లాహ్ యొక్క దూతలను పోలి యుండును. వారివలెనే అన్నివేళల యందు ఆరాధనల లోను, అల్లాహు తఆలా నామ సంస్మరణ యందును, అల్లాహు తఆలా యొక్క ఔన్నత్యమును కొనియాడుట యందును లీనమై యుండును.

**10**. మస్‌జిద్ అల్లాహు తఆలా యొక్క ఇల్లు. కాబట్టి ఇత్‌తికాఫ్‌లో యున్న ముత్‌తకిఫ్ (ఇత్‌తికాఫ్ ఆచరించువ్యక్తి) అల్లాహు తఆలా యొక్క పొరుగువాడు కాదు కదా, ఇంటిలో ఉన్న అతిధిగా పరిగణింప బడును.

**11.** ముత్‌తకిఫ్ (ఇత్‌తికాఫ్ ఆచరించువ్యక్తి) అల్లాహ్ ఇంటిలో యుండుటచే షైతాన్ యొక్క దాడుల నుండి సురక్షితముగా యుండును.

**12.** ముత్‌తకిఫ్ (ఇత్‌తికాఫ్ ఆచరించువ్యక్తి) ప్రతి నిమిషం అల్లాహ్ యొక్క ఆరాధనలో యుంటాడు. కాబట్టి అతనికి 'షబ్–ఎ–ఖదర్' కూడ తప్పిపోదు. కాబట్టి 'షబ్–ఎ–ఖదర్' ఆరాధన యొక్క పుణ్య ఫలము కూడ అతనికి లభించును.

(బిహిష్తీజేవర్, 3/21, దీనియాత్ 2 యం, స.73)

## 27.3. ఇత్‌తికాఫ్ యొక్క సంకల్పము (నియ్యత్ )

**బిస్మిల్లాహి దఖల్‌తు వ అలైహి తవక్కల్‌తు వ నవైతు సున్నతల్ ఇత్‌తికాఫ్** (అల్లాహ్ యొక్క శుభనామముతో (నేను మసీదులో ప్రవేశించు చున్నాను) మరియు అతనిపై సంపూర్ణ విశ్వాసము కలిగి యున్నాను. మరియు సంప్రదాయమైన ఇతిత్‌కాఫ్ యొక్క సంకల్పము చేయుచున్నాను)

## 27.4. ఇఅ్తికాఫ్ లో రకాలు

ఇఅ్తికాఫ్ మూడు రకాలు. అవి: **01.** వాజిబ్ **02.** సున్నతె ముఅక్కదా **03.** ముస్తహబ్.

### 27.4.1. వాజిబ్

మ్రొక్కుబడి తీర్చుట కొరకు ఆచరించు ఇఅ్తికాఫ్ వాజిబ్ అవుతుంది. ఉదా: ఎవరైనా నా ఫలానా పని పూర్తి అయినచో నేను అల్లాహు తఆలా కొరకు మూడు రోజులు ఇతిఅ్కాఫ్ ఉంటానని మ్రొక్కుబడి చేసుకొనినచో, మూడు రోజులు ఇఅ్తికాఫ్ యుండుట వాజిబ్ (తప్పనిసరి) అగును. ఏదైనా కారణంగా వాజిబ్ ఇఅ్తికాఫ్ భంగమైతే దాని ఖజా పాటించడం వాజిబ్ (తప్పనిసరి) అవుతుంది.

### 27.4.2. సున్నతె ముఅక్కద

పవిత్రమైన రమజాన్ నెలలోని చివరి 10 రోజులలో ఆచరించే ఇఅ్తికాఫ్ సున్నతె ముఅక్కద అలల్ కిఫాయహ్ అనగా ఆ ఊరి లోని కొంత మంది ఆచరించిన అందరి తరఫున సరిపోతుంది. ఇది రమజాన్ నెల 20 వ తేది సూర్యుడు అస్తమించి నప్పటి నుండి ప్రారంభ మగును. షవ్వాల్ మాసపు (రమజాన్ పండుగ) నెలవంకను చూసిన వెంటనే ముగియును. నెలవంక రమజాన్ నెల 29 వ తేదీ అంతంలో కనిపించినా, 30 వ తేది అంతములో కనిపించినను, షవ్వాల్ మాసపు నెలవంకను చూచిన వెంటనే ఇఅ్తికాఫ్ పూర్తి అవుతుంది.

### 27.4.3. ముస్తహబ్

పైన పేర్కొనబడిన వాజిబ్ మరియు సున్నతె ముఅక్కద కాక మిగిలిన అన్ని ఇఅ్తికాఫ్‌లు ముస్తహబ్ గా పరిగణింప బడును. వీని కొరకు ప్రత్యేక సమయ నిర్ణయ మేమియు లేదు. సంవత్సరములోని అన్ని రోజులలోను పాటించ వచ్చును. (దీనియాత్ 2 యం, స.74)

### గమనిక

వాజిబ్ ఇఅ్తికాఫ్ కొరకు ఉపవాస ముండుట తప్పనిసరి. కావున కనీసము ఒక రోజైనా ఉండాలి. కొన్ని గంటలు లేక కేవలము రాత్రి ఇఅ్తికాఫ్ యొక్క మ్రొక్కుబడి చేయుట తగదు. (దీనియాత్ 2 యం, స.74)

## 27.5. ఇత్‌తికాఫ్ కొరకు షరతులు

**01.** ముస్లిమ్ అయి యుండాలి.

**02.** హదసె అక్బర్ (జనాబత్, హైజ్ మరియు నిఫాస్‌ల వల్ల సంభవించే పెద్ద అశుద్ధత) నుండి పరిశుభ్రత పొంది యుండాలి.

**03.** మతిస్థిమితము గలవాడై (ప్రాజ్ఞుడై) ఉండాలి. (తెలివి లేనివాడు, పిచ్చివాడు కారాదు)

**04.** పురుషులు మస్‌జిద్ లో ఇత్‌తికాఫ్ ఆచరించాలి.

**05.** ఇత్‌తికాఫ్ యొక్క సంకల్పము (నియ్యత్) చేయాలి. (దీనియాత్ యం, స.74)

### గమనిక

01. స్త్రీలు అపరిశుద్ధావస్థలో అనగా బహిష్టు అయినప్పుడు, నిఫాస్ (పురుటి రక్తస్రావము) స్థితిలో ఇత్‌తికాఫ్ పాటించరాదు.

## 27.6. ఇత్‌తికాఫ్ లో చేయదగిన పనులు

**01.** మల, మూత్ర విసర్జన కొరకు మసీదు నుండి బయటకు వెళ్ళుట.

**02.** ఫర్జ్ గుస్ల్ కొరకు మసీదు నుండి బయటకు వెళ్ళుట.

**03.** అజాన్ పలుకువారు లేని యెడల అజాన్ పలుకు స్థలమునకు మసీదు నుండి బయటకు వెళ్ళుట.

**04.** జుముఅ ఖుత్‌బా పూర్వము నాలుగు రకఅత్‌లు సున్నత్ నమాజ్ చదువుటకు సరిపడే సమయము మాత్రమే ఉండేట్లు జుముఅ నమాజ్ కొరకు జామిఅ మసీదుకు వెడలుట.

**05.** మసీదులో తినుట, త్రాగుట, నిద్రించుట.

**06.** కుటుంబ లేక వ్యాపార సంబధమైన అత్యవసర విషయాలు మాత్రమే మాట్లాడుట.

**07.** ఆహార పానీయాలు తెచ్చి ఇచ్చువారు లేనిచో, వాటి కొరకు వెళ్ళుట కూడ తగును. (దీనియాత్ 7 యం, స.75)

## 27.7. ఇత్‌తికాఫ్ లో అవాంఛనీయ (మక్రూ) విషయాలు

మౌనమును ఆరాధనగా భావించి, మౌనముగా యుండుట, కొట్లాడుట, పోట్లాడుట, అనవసరపు మాటలు మాట్లాడుట. (దీనియాత్ 2 యం, స.75)

## 27.8. ఇతిఖాఫ్ లో అభిలషణీయ కార్యాలు

**01.** జామిఅ మస్జిద్ లో ఇత్‌తికాఫ్ ఆచరించుట.

**02.** ఆరాధనలు, ఖుర్ఆన్ పఠనము, జిక్ర్ (అల్లాహ్ నామ స్మరణము) చేయుట, మరియు దరూదె షరీఫ్ పఠించుటలో నిమగ్నులగుట.

03. పాపాల క్షమాబిక్ష కొరకు అల్లాహ్‌ను అధికముగా వేడుకొనుట.

**03.** ధార్మిక పుస్తకములు చదువుట, ప్రవక్తలు, సహాబాల, ఔలియా అల్లాహ్‌ల వృత్తాంతములు చదువుట.

**04.** ఉపన్యాసములిచ్చుట, హిత బోధ చేయుట మొదలగునవి. (దీనియాత్ 2 యం, స.75)

## 27.9. ఇతిఖాఫ్‌ను భంగపరిచే విషయాలు

**01.** అనుమతింపబడిన కారణము లేకుండా కావాలని కాని మరచిపోయి కాని మసీదు నుండి బయటకు వెళ్ళుట లేక ఎవరైన బలవంతముగా మసీదు నుండి గెంటి వేయుట.

**02.** భయము చేత గాని లేక వ్యాధి కారణంగా కానీ మసీదు నుండి బయటకు వెళ్ళుట.

**03.** ఇత్‌తికాఫ్ స్థితిలో సంభోగము చేయుట.

**04.** అనుమతింపబడిన కారణముతో బయటకు వెళ్ళినప్పటికి, అవసరము కన్నను ఎక్కువ సమయము బయట గడుపుట. ఉదా: మల మూత్ర విసర్జనకు బయటకు వెళ్ళి, ఆ కార్యము పూర్తి చేసుకొన్న వెంటనే తిరిగిరాక ఎవరితోనైన మాట్లాడుతూ గడపడం.

**సిధ్ధాంతము:** వుజూ ఉన్నప్పటికీ తాజా వుజూ చేయుటకు వెళ్ళినను, గుస్ల్ వాజిబ్ కాకున్నను గుస్ల్ చేయుటకు వెళ్ళినను ఇత్‌తికాఫ్ భంగమగును.

**హెచ్చరిక:** వాజిబ్ ఇత్‌తికాఫ్ భంగమైన యెడల, ఎన్ని రోజుల ఇత్‌తికాఫ్ సంకల్ప ముండినదో, అన్ని రోజుల ఖజా ఇత్‌తికాఫ్ ఆచరించడం వాజిబ్ (తప్పనిసరి) అగును. కాని సున్నత్ ఇత్‌తికాఫ్ భంగమైన యెడల, కేవలము భంగమైన రోజు ఇత్‌తికాఫ్ మాత్రమే ఖజా ఆచరించుట వాజిబ్ (తప్పనిసరి) అగును. (బిహిష్తీజేవర్, 3/21, దీనియాత2యం, స.75)

## 28. షబె ఖద్ర్ (ఘనమైన రాత్రి) ఘనతలు

### 28.1. ష బె ఖ ద్ర్ లేక లైలతుల్ ఖద్ర్

సంవత్సరము మొత్తంలో శుభప్రద మయినది రమజాన్ నెల. రమజాన్ నెలలో అత్యంత విలువైనది మరియు పుణ్యప్రదమయిన రాత్రి షబె ఖద్ర్. ఆ రాత్రిని అన్వేషించి, దానిని పొంది, పశ్చాత్తాప భావముతో అల్లాహ్‌ను ఆరాధించిన వ్యక్తి యొక్క అపరాధము లన్నియు క్షమించ బడతాయి.

ఎవరైతే (నిష్కల్మషమైన) విశ్వాసముతో మరియు పుణ్య ఫలాపేక్షతో షబె ఖద్ర్ (ఘనమైన రాత్రి) నందు అల్లాహ్ ఆరాధనలో గడిపాడో అతని వల్ల జరిగిన పాపాలు, జరుగబోయే పాపాలు క్షమించబడతాయి. (బుఖారి, అబూదావూద్)

పవిత్ర ఖుర్ఆన్ మరియు హదీసుల మూలముగా షబె ఖద్ర్ యొక్క ఘనత స్పష్టమవు చున్నది. ఇది వేయి నెలల కన్నా శ్రేష్ఠమైనది. అనగా వెయ్యి నెలలు ఆరాధించిన కలుగు పుణ్యఫలము కన్నా అత్యధిక పుణ్య ఫలము షబె ఖద్ర్‌లో ఆరాధించుట వలన కలుగును. (బయానుల్‌ఖుర్ఆన్)

"షబె ఖద్ర్ లో అల్లాహ్ దూత జిబ్రాఈల్ అలైహిస్సలామ్ అల్లాహ్ దూతల సమూహముతో భూమిపై దిగును. నిల్చొని లేదా కూర్చొని అల్లాహ్ నామ స్మరణలో నిమగులై యున్న ప్రతి అల్లాహ్ దాసుని కొరకు కారుణ్యం, మన్నింపుల దుఆ చేస్తారు మరియు దాసులు దుఆ చేస్తున్నప్పుడు ఆమీన్ పలుకుతారని" మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (బైహఖీ వ బయానుల్‌ఖుర్ఆన్)

అల్లాహ్ దూతలు షబె ఖద్ర్ యొక్క రాత్రి యందు ప్రతి ముస్లిం ఇంటి యందు ప్రవేశించి దుఆ చేయుదురు. ఆ ముస్లింల సమస్త పాపములు క్షమించ బడతాయి. కాని నాలుగు గృహాలలో అల్లాహ్ దూతలు ప్రవేశించరు. అవి: **01.** కుక్క ఉన్న ఇల్లు. **02.** పంది ఉన్న ఇల్లు. **03.** సారాయి లేక సారా త్రాగినవారు ఉన్న ఇల్లు. **04.** వ్యభిచారులు ఉన్న ఇల్లు. వీరు కాక మిగిలిన అందరి కొరకు ఉదయము వరకు దుఆ చేయుదురు. ఉదయమవుతన్నప్పుడు అల్లాహ్ దూతలు జిబ్రాఈల్ అలైహిస్సలామ్ తో "ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారి అనుచర సమూహము విషయముగా అల్లాహు తఆలా ఏమి నిర్ణయించిరని" ప్రశ్నింతురు. దానికి సమాధానముగా జిబ్రాఈల్ "నలుగురు దురదృష్టవంతులు తప్ప

ముస్లిములందరి పాపములు క్షమించబడినవి. ఆ నలుగురు ఎవరనగా **01.** సారాయి త్రాగువాడు. **02.** తల్లిదండ్రులకు అవిధేయుడు. **03.** బంధువులతో చెడుగా ప్రవర్తించువాడు. **04.** కపటము, ద్వేషము ఉంచువాడు" అని పలికిరి.

పవిత్రమైన రమజాన్ నెలలోని చివరి పది రోజులలోని బేసి సంఖ్య రాత్రులలో ఒక రాత్రి షబె ఖద్ర్ ఉండ వచ్చును. అనగా 21, 23, 25, 27, 29 – తేదీలకు ముందు వచ్చే రాత్రి యంతయు బాగుగా ఆరాధించ వలెను. వాటిలో ఏదో ఒక రాత్రి షబె ఖద్ర్ కావచ్చును.

### 28.2. షబె ఖద్ర్ లో చేయు దుఆ

షబె ఖద్ర్ రాత్రి యందు దాసుడు తాను కోరిన దుఆ చేయ వచ్చును. కాని హదీసులో ఒక ప్రత్యేకమైన దుఆ ప్రస్తావించబడి యున్నది. ఆ దుఆ చేయుట ఎంతో మంచిది.

**అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ తుహిబ్బుల్ అఫ్వ ఫఅ్ఫు అన్నీ.**
(ఓ అల్లాహ్! నిస్సందేహముగా నీవు అధికముగా క్షమించేవాడివి. క్షమించుటకు నీవు మిక్కిలి ఇష్టపడువాడవు. కనుక నన్ను క్షమించుము)

## 29. ఫిత్రా దానము (సద్ఖ యె ఫిత్ర్)

ఉపవాసము ఆచరించేవారి వలన జరిగిన పనికి మాలిన పనుల నుండి, నీతి బాహ్యమైన విషయాల నుండి వారిని పరిశుద్ధము చేయడానికి, పేదవారికి ఆహార పానీయాలు సమకూరడానికి ఫిత్రా దానము (ముస్లింలపై) విధి అయి యున్నది.

**"ఉపవాసి వలన జరిగే అవాంఛనీయ విషయాలను ప్రక్షాళము చేయడానికి, సమాజములోని నిరుపేదల్ని, అభాగ్యజీవుల్ని, ఆదుకోవడానికి ఫిత్రా దానము విధి చేయబడినది."** (అబూదావూద్) రమజాన్ ఉపవాసాలు ఆచరించుటలో జరిగిన పొరబాట్లకు, లోపాలకు పరిహారముగా ఉపవాసాలు ముగించిన సందర్భముగా పేదలకు ఇవ్వవలసిన దానము ఇది. దీని వలన పేదలు కూడ సంతోషముగా పండుగ జరుపు కొనుటకు వీలు కలుగును.

**"ఈద్ నమాజ్‌కు పూర్వమే ఫిత్రా దానము చెల్లిస్తే అది స్వీకృత దానము**

**అవుతుంది. ఈద్ నమాజ్ ముగిసిన తరువాత ఫిత్రా చెల్లిచిన అది సాధారణ దానముల వలె ఒకదానము అవుతుంది"** అని అల్లాహ్ ప్రవక్త అయిన హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (అబూదావూద్)

## సదఖయె ఫిత్రా ఆదేశము

ప్రతి ముస్లిమ్ పెద్దవాడయిననూ, పిన్నవాడయిననూ, స్త్రీ అయిననూ, పురుషుడయిననూ, తనపై జకాత్ తప్పనిసరి (వాజిబ్) అయినను, జకాత్ వాజిబ్ కాక పోయిననూ జకాత్ తప్పనిసరి (వాజిబ్) అగు విలువగల వస్తు సామగ్రి అవసరానికి మించి యున్న యెడల, ఆ వస్తు సామగ్రి వ్యాపార సంబంధమైనను, వ్యాపార సంబంధము కాక పోయినను, ఆ వస్తు సామగ్రిపై సంవత్సరము గడిచినను, సంవత్సరము గడవక పోయినను, రమజాన్ పండుగ రోజు ఫిత్రా దానము చేయుట వాజిబ్ అయి యున్నది. దీనిని షరీఅత్‌లో (ధార్మిక పరిభాషలో) "సదఖయె ఫిత్ర్" అంటారు. (బిహిష్తీ జేవర్)

## సదఖాయె ఫిత్రా చెల్లించే సమయము

ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) రోజు ఉషోదయము కాగానే ఫిత్రా దానము చేయుట వాజిబ్ అవుతుంది. **"ఈద్‌గాహ్‌కు బయలుదేరే ముందే ఫిత్రా దానము ఇవ్వాలి"** (బుఖారీ, ముస్లిమ్) పురుషులు ఈద్ నమాజ్‌కు ఈద్‌గాహ్‌కు వెళ్ళక పూర్వమే ఫిత్రా దానము చేయుట శ్రేష్ఠము. ఒకవేళ అట్లు ఇవ్వనిచో ఈద్ నమాజ్ తరువాత అయినా ఇవ్వవలెను. ఎవరైన పండుగ రోజు ఫిత్రా దానము చేయనిచో, అది క్షమించ బడదు. ఏదో ఒక రోజు దానిని తప్పని సరిగా చెల్లించ వలెను.

## సదఖాయె ఫిత్ర్ పరిమాణము

సదఖయె ఫిత్ర్ పరిమాణము 1 కిలో 574 గ్రాములు 640 మిల్లి గ్రాముల ఆహార ధాన్యము. ఆహార ధాన్యమైనను దానము చేయ వచ్చును లేక దాని వెలకట్టి, నగదు రూపములో పేదలకు ఇవ్వ వచ్చును.

## సదఖయె ఫిత్రా దానము చెల్లించు ఆదేశాలు

స్థితిపరుడైన ప్రతి ముస్లిమ్ సదఖయె ఫిత్ర్ కేవలము తన తరపునే కాక యుక్త వయస్సుకు చేరని తన పిల్లల తరపున కూడ చెల్లించుట వాజిబ్ అయి

యున్నది. అనగా యుక్త వయస్సుకు చేరిన పిల్లల తరపున గాని, తల్లిదండ్రుల తరపున గాని, భర్త భార్య తరపున గాని, భార్య భర్త తరపున గాని చెల్లించుట వాజిబ్ కాదు. (బిహిష్తీజేవర్, 3/34)

పిల్లలు సదఖయె ఫిత్ర్ వాజిబ్ అగుటకు కావలసిన సంపద కలిగిన వారైతే, వారి సంపద నుండి సదఖయె ఫిత్ర్ చెల్లించాలి. ఒక వేళ పిల్లలు పండుగ రోజు ఉషోదయము తరువాత పుట్టి యుండినచో, వారిపై సదఖయె ఫిత్ర్ వాజిబ్ కాదు. (బిహిష్తీజేవర్, 3/34)

ఎవరైన ఏదో కారణముతో రమజాన్ నెలలో ఉపవాసములు ఆచరించక పోయినను, సదఖయె ఫిత్ర్ చెల్లించుట వాజిబ్ అయి వున్నది. రమజాన్ ఉపవాసములు ఆచరించినను, ఆచరించక పోయినను, సదఖయె ఫిత్ర్ చెల్లించుట వాజిబ్ అయి వున్నది, వీరిలో ఎటువంటి తేడా లేదు. (బిహిష్తీజేవర్, 3/34)

ఒకరి సద్ఖాయె ఫిత్ర్ మొత్తము ఒకే పేదవానికి ఇవ్వ వచ్చును లేదా కొద్ది కొద్దిగా చేసి అనేక పేదలకు ఇవ్వ వచ్చును. అనేకుల సద్ఖాయె ఫిత్ర్ ఒకే పేదవానికి కూడ ఇవ్వ వచ్చును. అన్ని విధాలు కూడ సమ్మతమే. కాని ఒక పేదవానికి కనీసము ఒక రోజు భత్యమునకు సరిపడునంతైనా ఇచ్చుట ఉత్తమము. ఎవరైతే జకాత్ తీసుకొనుటకు హక్కుదారులో, వారే సదఖాయె ఫిత్ర్‌కు కూడా హక్కుదారులు. (బిహిష్తీజేవర్, 3/34)

## గమనిక

జకాత్ అయినా ఫిత్రా అయినా కేవలం దైవ ప్రసన్నత కొరకే చెల్లించు చున్నామన్న సంకల్పశుద్ధి ఎంతో అవసరము. స్వార్థం, పేరు ప్రతిష్టలు మొదలైన ఎలాంటి ప్రాపంచిక భావనలు ఉండకూడదు. సదఖా ఇస్తూ మనం ఏదో ఉపకారం చేస్తున్నామని భావించడం గాని, లేదా సదఖా స్వీకరిస్తున్న వారి నుంచి ప్రశంసల్ని, కృతజ్ఞతలను ఆశించడము గాని లేదా మరేదైన ప్రవర్తన మూలముగా వారి మనస్సును నొప్పించడము గాని జరిగితే మన దానధర్మాలకు అర్థమే ఉండదు. కావున పై వాటికి భిన్నంగా పేదల హక్కును పేదలకు అందజేస్తున్నామని భావించాలి. తనపై ఉన్న ఒక బాధ్యతా భారాన్ని దించుకుంటున్నానని, దానికి ఆ పేదవాడు మనకు సహాయపడ్డాడని అనుకోవాలి.

## 30. పండుగలు

ఇస్లామ్ నందు రెండే రెండు పండుగలు కలవు. అవి: **01.** ఈదుల్ ఫిత్ర్, అనగా రమజాన్ పండుగ. **02.** ఈదుల్ అజ్‌హా, అనగా బక్రీద్ పండుగ. సంవత్సరములో ఈ రెండు రోజులు ఆనందోత్సాహాలతో గడపటానికి నిర్ణయింప బడియున్నాయి. హనఫీ ధర్మశాస్త్రము ననుసరించి ఇవి ముస్లిములకు వాజిబ్ అయి యున్నవి.

### 30.1. ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ)

పవిత్రమైన రమజాన్ నెల ముగిసిన తరువాత షవ్వాల్ నెల మొదటి తారీఖున ఈదుల్ ఫిత్ర్ పండుగ జరుపు కొందురు. రమజాన్ శుభమాసంలో దైవం నిర్ణయించిన ఆరాధనలు, ఉపవాస వ్రతాలు, తరావీహ్ నమాజ్‌లు, ఖుర్ఆన్ పారాయణం, దానధర్మాలు మొదలగు సత్కార్యాలను అల్లాహ్ అనుగ్రహంతో సక్రమంగా నెరవేర్చగలిగి నందుకు, ముస్లిమ్‌లు అల్లాహ్ పట్ల కృతజ్ఞతా భావంతో "ఈదుల్ ఫిత్ర్" జరుపు కుంటారు.

పండుగ రోజున గుస్ల్ (తలస్నానము) చేయడం, సుగంధ ద్రవ్యాలు పూసుకోవడం, ఉన్నవాటిలో మంచి దుస్తులు ధరించడం, షరీఅత్ చూపిన పరిధులలో రుచికరమైన ఆహార పదార్థములు భుజించడం, శుభాకాంక్షలు తెలుపుకోవడం మన సాంప్రదాయము.

### 30.2. ఈదుల్ అజ్‌హా (బక్రీద్)

"జిల్‌హిజ్జా" నెల 10 వ తారీఖున బక్రీదు (బఖర్ ఈద్) ను జరుపు కుందురు. హ్రజత్ ఇబ్రాహీం అలైహిస్సలామ్ తన ముద్దుల కుమారుడు హ్రజత్ ఇస్మాఈల్ అలైహిస్సలామ్‌ను, బలివ్వడానికి సంసిద్ధులవడం, హ్రజత్ ఇస్మాఈల్ అలైహిస్సలామ్ అల్లాహ్ యొక్క అభీష్టానికి అనుగుణంగా తన ప్రాణ త్యాగానికి సంసిద్ధులు కావడం – ఈ అపూర్వ త్యాగాలను గుర్తుకు తెచ్చే సంస్మరణ దినం. ఈ సంస్మరణ దినాన్ని పాటించడం ద్వారా తమ వద్దనున్న ధన ప్రాణాలను సైతం దేవుని ఆజ్ఞ అయితే ఆయన మార్గంలో త్యాగం చేయడానికి సంసిద్ధంగా ఉన్నామని మాటలతోను, చేతలతోను ప్రకటించుటయే దీని ధ్యేయము.

## 30.3. పండుగ రాత్రుల యొక్క విశిష్ఠత

"ఎవరైతే పుణ్య సముపార్జనా సంకల్పముతో రెండు పండుగల రాత్రులందు మేల్కొని అల్లాహ్‌ను ఆరాధించుట యందు నిమగ్నులై యుంటారో, అందరి మనస్సు నశించు రోజున, అతని యొక్క మనస్సు నశించదు" అని మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. అనగా అందరు భయంకరమైన ప్రళయ దినాన మిక్కిలి క్లిష్ట పరిస్థితులలో యున్నను, ఇతనికి ఎటువంటి చీకు చింత యుండదని అర్థము. (బిహిష్తీ జేవర్, హి.తీన్, స76)

### ముఖ్య గమనిక

పండుగ రోజు రాత్రి అనగా పండుగకు పూర్వపు రాత్రి అని అర్థము. ముందు రాత్రి వచ్చిన తరువాత పండుగ (పగలు) వచ్చును.

## 30.4. పండుగ సున్నత్‌లు (సాంప్రదాయాలు)

**01.** మిక్కిలి ముందుగా (పెందలకాడ) నిద్ర మేల్కొనుట.

**02.** మిస్వాక్ చేయుట. (పళ్ళు తోముపుల్లతో పళ్ళు తోముట)

**03.** గుస్ల్ (తలస్నానము) చేయుట.

**04.** తన దగ్గర ఉన్నవాటిలో మంచి దుస్తులను ధరించుట.

**05.** సుగంధ ద్రవ్యాలను పూసుకొనుట.

**06.** ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) రోజు ఖర్జూరపు పండు లేక ఏదైన తీపి పదార్థము తిని నమాజ్‌కు వెళ్ళుట.

**07.** ఈదుల్ అజ్‌హా (బక్రీద్) నమాజ్ తరువాత తాను ఇచ్చిన ఖుర్‌బానీ మాంసమును భుజించుట. (దీనియాత్ 4 బిజి)

**08.** ఈద్‌గాహ్‌కు తొందరగా వెళ్ళుట.

**09.** ఈద్‌గాహ్‌కు పండుగ నమాజ్ కొరకు కాలినడకన వెళ్ళుట.

**10.** నమాజ్ కొరకు ఈద్‌గాహ్‌కు వెళ్ళేటప్పుడు ఒక మార్గాన, వచ్చేటప్పుడు ఇంకొక మార్గాన వచ్చుట.

**11.** ఈద్‌గాహ్ వెళ్ళేటప్పుడు బిగ్గరగా తక్బీరు పలుకుట.

**12.** అత్యధికముగా దానధర్మాలు చేయుట.

**13.** ఈద్‌నమాజ్ కు పూర్వము ఎటువంటి నఫిల్ నమాజ్‌లు చదువ కుండుట.

**14.** తమ వాడ యందలి మసీదులో ఫజ్ర్ (ఉదయపు) నమాజ్ చదువుట.

**15.** ఖుర్బానీ చేయవలసినవారు జిల్‌హిజ్జ నెలవంక చూసినప్పటి నుండి ఖుర్బానీ చేయు వరకు వెంట్రుకలు తీయించకుండుట, గోళ్ళు కత్తిరించ కుండుట ముస్తహబ్ (అభిలషణీయము) అయి యున్నది. (హవాల: తహ్‌తావీ స. 293)

## 30.5. పండుగ రోజుల తక్బీరు

ఈద్‌గాహ్ వెళ్ళే సమయాన దారి యందు మరియు ఈద్‌గాహ్ లోను నమాజ్‌కు పూర్వము ఈ తక్బీర్ చదువుతూ యుండాలి.

**1. అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ లాఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, వలిల్లాహిల్ హమ్‌ద్.** (అల్లాహ్ అందరికన్నా గొప్పవాడు, అల్లాహ్ అందరికన్నా గొప్పవాడు, అల్లాహ్ తప్ప వేరే ఎవ్వరూ ఆరాధనా యోగ్యులు లేరు. మరియు అల్లాహ్ అందరికన్నా గొప్పవాడు,అల్లాహ్ అందరికన్నా గొప్పవాడు, సమస్త స్తోత్రముము అల్లాహ్‌కే చెందును)

## 30.6. పండుగ నమాజ్‌లు

ఈదుల్ ఫిత్ర్, మరియు ఈదుల్ అజ్‌హా – ఈ రెండు పర్వదినాలలో అల్లాహు తఆలాకు కృతజ్ఞతలు అర్పించు కోవడానికి రెండు రకాతుల నమాజ్ ఆచరించుట పురుషులపై వాజిబ్ (అనివార్యం) గా నిర్ణయించబడింది. ఈ రెండు నమాజ్‌లలో అజాన్ గానీ, ఇఖామత్ గానీ ఇవ్వబడవు. ఏ వ్యక్తిపై జుముఅ నమాజ్ (శుక్రవారపు నమాజ్) వాజిబ్ అవుతుందో, ఆ వ్యక్తిపై ఈద్ నమాజ్ కూడా వాజిబ్ అవుతుంది. ఏ ప్రదేశములో జుముఅ నమాజ్ ఆచరించుట తగునో, అటువంటి ప్రదేశాలలో ఈద్ నమాజ్ కూడ ఆచరించుటకు తగినదిగా భావించబడుతుంది. ఈ రెండు పండుగల నమాజ్ సమయం సూర్యుడు ఉదయించిన 20 నిమిషాల తరువాత నుండి జవాల్ (మిట్టమధ్యాహ్నమున) కు పూర్వము వరకు ఉంటుంది. (దీనియాత్ 1 యం స. 101)

ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) రోజున ఖర్జూరపు పండు లేదా యేదైనా తీపి పదార్థము తిని నమాజ్‌కు వెళ్ళుట సున్నత్ (ప్రవక్త గారి సాంప్రదాయము). ఈదుల్ అజ్‌హా (బక్రీద్ పండుగ) రోజున నమాజ్ తరువాత, తాను ఖుర్బానీ ఇచ్చిన జంతువు యొక్క మాంసము తినుట సున్నత్ (సాంప్రదాయము). (దీనియాత్ 5 బిజి స. 101)

ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) రోజున నమాజ్ కొరకు ఈద్గాహ్ లేక

మసీదుకు వెళ్ళునపుడు "తక్బీర్" మెల్లగా పలుకుట, ఈదుల్ అజ్‌హా (బక్రీద్ పండుగ) రోజున నమాజ్‌కు వెళ్ళునప్పుడు "తక్బీర్" బిగ్గరగా పలుకుట సాంప్రదాయము.

ఈదుల్ ఫిత్ర్ (రమజాన్) నమాజ్ ఆలస్యంగా చదువుట, ఈదుల్ అజ్‌హా (బక్రీదు పండుగ) నమాజ్ త్వరగా చదువుట మస్‌నూన్ (సాంప్రదాయము). స్థోమతగలవారు ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) రోజున "సదఖాయె ఫిత్ర్" (ఫిత్రా దానం) చేయుట, ఈదుల్ అజ్‌హా (బక్రీదు పండుగ) రోజున "ఖుర్బానీ" ఇచ్చుట వాజిబ్ అయి యున్నది. (బిహిష్తీ సమర్, హిస్స అవ్వల్, స. 131)

ఈద్ (పండుగ) నమాజ్ చదివే ప్రదేశాలలో ఈద్ నమాజ్ కు పూర్వము గానీ తరువాత గానీ వేరే నమాజ్‌లు ఆచరించుట మక్రూ (అప్రీతికరము) ఈద్ (పండుగ) నమాజ్ తరువాత ఇంటికి వచ్చి నమాజ్ ఆచరించిన మక్రూ కాదు, కానీ ఈద్ (పండుగ) నమాజ్‌కు పూర్వం ఇంటిలో నమాజ్ ఆచరించుట కూడా మక్రూ అగును. స్త్రీలు, మరియు ఏదైనా కారణాల వల్ల ఈద్ నమాజ్ ఆచరించనివారు కుడా ఈద్ (పండుగ) నమాజ్‌కు పూర్వం ఏవైనా నఫిల్ నమాజ్‌లు ఆచరించుట కుడా మక్రూ అవుతుంది. (బిహిష్తీ సమర్, హిస్స అవ్వల్, స.131)

## 30.7. ఈద్ (పండుగ) నమాజ్ ఆచరించే విధానము

### 1. నియ్యత్ (సంకల్పము)

**ఈదుల్ ఫిత్ర్ (రమజాన్ పండుగ) నమాజ్ కొరకు నియ్యత్** (సంకల్పము): "నేను ఈదుల్ ఫిత్ర్ యొక్క రెండు రకాతుల వాజిబ్ నమాజ్, ఆరు అదనపు తక్బీర్‌లతో, కాబా దిశకు అభిముఖుడనై, ఈ ఇమామ్ యొక్క నాయకత్వాన, అల్లాహు తఆలాను ప్రసన్నుని చేయుట కొరకు ఆచరించు చున్నాను."

**ఈదుల్ అజ్‌హా (బక్రీద్ పండుగ) నమాజ్ కొరకు నియ్యత్** (సంకల్పము): "నేను ఈదుల్ అజ్‌హా యొక్క రెండు రకాతుల వాజిబ్ నమాజ్, ఆరు అదనపు తక్బీర్‌లతో, కాబా దిశకు అభిముఖుడనై, ఈ ఇమామ్ యొక్క నాయకత్వాన, అల్లాహు తఆలాను ప్రసన్నుని చేయుట కొరకు ఆచరించు చున్నాను"

### 2. మొదటి రకాత్

పై విధముగా సంకల్పము చేసుకొన్న తరువాత, 'అల్లాహు అక్బర్' అని పలుకుచు, రెండు చేతులు చెవుల వరకు పైకెత్తి నాభి క్రింది భాగములో కట్టుకోవాలి.

రెండు చేతులను నాభి క్రింది భాగములో కట్టుకొన్న తరువాత, **సనా** చదవాలి. పిమ్మట ఇమామ్ గారు 'అల్లాహు అక్బర్' అని పలుకుచు రెండు చేతులను చెవుల వరకు పైకెత్తి క్రిందికి దించెదరు. మరల రెండవ సారి 'అల్లాహు అక్బర్' అని పలుకుచు రెండు చేతులను చెవుల వరకు పైకెత్తి క్రిందికి దించెదరు. మరల మూడవ సారి 'అల్లాహు అక్బర్' అని పలుకుచు రెండు చేతులను చెవుల వరకు పైకెత్తి నాభి క్రింది భాగములో కట్టుకొనెదరు. ముఖ్తదీలు కూడ అలాగే చేయాలి. (ఇప్పుడు మూడు అదనపు తక్బీర్ లు అయినవి. ప్రతి తక్బీర్ తరువాత 'సుబ్‌హానల్లాహ్' చదువ గలిగేంతటి వ్యవధి నివ్వాలి)

తరువాత మౌనంగా ఇమామ్ గారు చదివే సూరాల (ఖిరాఅత్) ను శ్రద్ధగా వినాలి. ఇమామ్ గారు "తఅవ్వుజ్" (అవూజు బిల్లాహి...) "తస్మియా" (బిస్మిల్లాహి...) చదివి "సూరయె ఫాతిహా" చదివిన తరువాత మరొక సూర చదివెదరు. తరువాత మామూలు నమాజ్‌లలో వలె రుకూ, సజ్దాలు పూర్తిచేసి, రెండవ రకాతు కొరకు లేచి నిలబడాలి. (దీనియాత్)

### 3. రెండవ రకాత్

రెండవ రకాత్ కొరకు లేచి నిలబడిన తరువాత, ఇమామ్ గారు "తస్మియా" (బిస్మిల్లాహి...) చదివి "సూరయె ఫాతిహా" చదివిన తరువాత మరొక సూర చదివెదరు. ముఖ్తదీలు ఖిరఅత్‌ను నిశ్శబ్దంగా శ్రద్ధగా వినాలి. పిమ్మట ఇమామ్ గారు 'అల్లాహు అక్బర్' అని పలుకుచు రెండు చేతులను చెవుల వరకు పైకెత్తి క్రిందికి దించెదరు. మరల రెండవ సారి 'అల్లాహు అక్బర్' అని పలుకుచు రెండు చేతులను చెవుల వరకు పైకెత్తి క్రిందికి దించెదరు. మరల మూడవ సారి 'అల్లాహు అక్బర్' అని పలుకుచు రెండు చేతులను చెవుల వరకు పైకెత్తి క్రిందికి దించెదరు. ముఖ్తదీలు కూడ అలాగే చేయాలి. (ఇప్పుడు మూడు అదనపు తక్బీర్ లు పూర్తయినవి) మరల నాల్గవసారి 'అల్లాహు అక్బర్' అని పలుకుచు రుకూ లోకి వెళ్ళిపోవాలి. తరువాత మామూలు నమాజ్‌లలోవలే సజ్దా మొదలగునవి పూర్తి చేసి సలాం చేసి నమాజ్‌ను పూర్తి చేయాలి.

తరువాత ఇమామ్‌గారు "దుఆ" చేసి, రెండు ఖుత్బాలు చదివెదరు. ముఖ్తదీలు (అనుకరించువారు) శ్రద్ధాభక్తులతో వినాలి. ఇమామ్ గారు ఖుత్బాలో "తక్బీరె తష్‌రీఖ్" అధికముగా పఠించాలి. (దీనియాత్ 1 యం. ప. 102)

## 30.8. తక్బీరె తష్రీఖ్

**"అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్,**
**లాఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్,**
**అల్లాహు అక్బర్, వలిల్లాహిల్ హమ్ద్."**

ఈ తక్బీరె తషరీఖ్ 5 రోజులు చదువ వలెను. ఈదుల్ అజ్హా (బక్రీదు పండుగ) కు ఒకరోజు ముందు అనగా జిల్హిజ్జా 9 వ తేదీ (యౌమె అర్ఫా/ అర్ఫారోజు) ఫజ్ర్ నమాజ్ నుండి జిల్హిజ్జా 13 వ తేదీ అసర్ నమాజ్ వరకు, ప్రతి ఫరజ్ నమాజ్ తరువాత ఒకసారి చదువుట వాజిబ్ అయి యున్నది.

ప్రతి ఫరజ్ నమాజ్ తరువాత, సలామ్ పలికిన వెంటనే పురుషులు బిగ్గరగా చదవాలి. స్త్రీలు మెల్లగా చదవాలి. ఒకవేళ ఇమామ్గారు మరచి పోయినను, ముఖ్తదీలు తప్పక చదవాలి. మస్బూఖ్ (ఆలస్యముగా జమాఅత్తో కలిసిన వ్యక్తి) తన తప్పిపోయిన నమాజ్ ఆచరించిన తరువాత కొద్ది బిగ్గరగా ఈ తక్బీరె తష్రీఖ్ను చదవాలి. (దీనియాత్ 1 యం స. 102)

### మసాయిల్ (సిద్ధాంతాలు)

**01.** ఈద్ నమాజ్ జమాత్తో కలసి ఆచరించ వలయునను నియమమున్నది. కనుక జమాత్ లేకుండా ఈద్ నమాజ్ నెరవేరదు. ఒకవేళ ఎవరికైనా ఈద్ నమాజ్ తప్పిపోయినచో, ఇక ఆ వ్యక్తి తప్పిపోయిన ఈద్ నమాజ్ను ఒంటరిగా ఆచరించడానికి వీలులేదు. కావున పెందలాడే ఈద్నమాజ్ కు వెళ్ళే ప్రయత్నము చేయవలయును.

**02.** ఎవరైనా ఈద్ నమాజ్లో పాల్గొని, మధ్యలో ఏదైనా కారణముచే, ఈద్ నమాజ్ భంగమైన (చెడిపోయిన) వ్యక్తి కూడా ఈద్ నమాజ్ ఒంటరిగా ఆచరించడానికి గానీ, దాని ఖజా నమాజ్ ఆచరించడానికి గానీ వీల్లేదు. ఈద్ నమాజ్ ఖజా నెరవేర్చ వలసిన బాధ్యత కూడా అతనిపై లేదు. ఒకవేళ నమాజ్ ఆచరించని కొంత మంది జమకూడి నమాజ్ ఆచరించుచున్నచో, వారితో కలిసి సామూహికముగా ఈద్ నమాజ్ ఆచరించ వచ్చును. (బిహిష్తీ సమర్, హిస్స అవ్వల్, స. 132)

**03.** ఈద్ నమాజ్ ఏ కారణము చేతనైన ఆచరించనిచో, నమాజ్ విడిచి పెట్టిన

పాపము కలుగును. కాబట్టి అల్లాహ్ తో పాప క్షమాపణ వేడుకో వలెను.

**గమనిక**

**01.** ఈద్ నమాజ్ లోని మొదటి రకాత్‌లో "సూరయె అత్‌లా", రెండవ రకాత్ లో "సూరయె గాషియా" చదువుట సాం|ప్రదాయము (సున్నత్) అయి యున్నది.

**02.** పండుగ నమాజ్‌లలో ఆరు అదనపు తక్బీర్‌లు పలుకుట వాజిబ్(తప్పనిసరి)

**03.** నమాజ్ ఆచరించిన తరువాత ఇమామ్ రెండు ఖుత్బాలు పఠించుట వాజిబ్.

**04.** ముఖ్తదీలు ఖుత్బా వినుట వాజిబ్. అనగా ఖుత్బా చదువు నప్పుడు నమాజ్ ఆచరించుట, మాట్లాడుట మొదలగునవన్నియు నిషిద్ధము. (బిహిష్తీ సమర్, హిస్స అవ్వల్, స.129)

# 31. ఖుర్బానీ వివరణ

## 31.1. ఖు ర్బా నీ

ఖుర్బానీ అనగా త్యాగము అని అర్థము. ఇస్లామీయ ధర్మశాస్త్రానుసారము జిల్‌హిజ్జా నెల 10వ తేది ఉదయము నుండి 12వ తేది సాయంత్రము వరకు అనగా ఖుర్బానీ రోజులలో అల్లాహు తఆలాను ప్రసన్నుని చేయుటకు జంతువును జుబా చేయుటను ఖుర్బానీ అందురు.

"ఖుర్బానీ రోజులలో అల్లాహు తఆలాకు ఖుర్బానీ కన్న ప్రీతికరమైన విషయము మరేదియు లేదు. ఆ రోజులలో ఫర్జ్ ఆరాధనలు తప్ప మిగిలిన సమస్త పుణ్యకార్యముల కన్న శ్రేష్ఠమైనది ఖుర్బానీ. జబహ్ (ఇస్లాం ధర్మశాస్త్రాను సారం జంతువును చంపు) సమయములో భూమిపై పడు నెత్తుటి బొట్టు, భూమిని తాకక ముందే అల్లాహు తఆలా చెంత అది అంగీకరింప బడుతుందని" రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (తిర్మిజి). కాబట్టి అత్యధిక సంతోషముతో, మనస్ఫూర్తిగా ఖుర్బానీ చేయవలెను. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1 యం స. 105).

## 31.2. ఖుర్బానీ చేయదగిన సమయము

జిల్‌హిజ్జా నెల 10వ తేది ఉదయము నుండి 12వ తేది సాయంత్రము వరకు ఖుర్‌బానీ చేయవచ్చును. కానీ బక్రీదు పండుగ నమాజ్ చదవక పూర్వము

చేయుట తగదు. అయినప్పటికి, పండుగ నమాజ్ చదువని పల్లెటూర్లలో జిల్‌హిజ్జ 10వ తేది ఉషోదయము తరువాత ఖుర్బానీ చేయవచ్చును.

## 31.3. ఎవరిపై ఖుర్బానీ తప్పనిసరి అయి యున్నది ?

వయోజనులైన (పెద్దవారైన) ప్రతి ముస్లిమ్ పురుషులు మరియు స్త్రీలు మతిస్థిమితము గల్గియుండి (ప్రాజ్ఞుడైయుండి), సంపన్నుడై, స్థానికుడైయున్నచో ఖుర్బానీ తప్పనిసరి (వాజిబ్) అగును.

స్థితిపరుడనగా ఖుర్బానీ రోజులలో ఎవరిచెంత తాను నివాస ముందుటకు ఇల్లు, ఇంటిలో అవసరమైన వస్తుసామగ్రి, ధరించు దుస్తులు, ప్రతిరోజు ఉపయోగించు ఇతర వస్తువులు మినహాయించి, 521/2 తులాలు అనగా 612.360 గ్రాముల వెండి లేక 71/2 తులాలు అనగా 87.479 గ్రాముల బంగారు, లేక ఈ రెండింటిలో దేని విలువ తక్కువ యుండిన అంత విలువకు సరిపడు నగదు, వ్యాపార సామగ్రి, అవసరమునకు మించి యున్న ఇల్లు, భూమి, అంగడి, లేక వేరే సామగ్రి యుండినచో, ఇటు వంటి వ్యక్తిని స్థితిపరుడు అందురు. ఇటువంటి వారిపై ఖుర్బానీ తప్పనిసరి అవుతుంది.

### ముఖ్య గమనిక

**01.** స్థితిపరుని బంగారు, వెండి, నగదు మొదలగు వానిపై జకాత్ వలె ఖుర్బానీ కొరకు సంవత్సరము గడవ వలసిన పనిలేదు.

**02.** కొంత మంది ఖుర్బానీని హజ్ వలె భావించి జీవితములో ఒకసారి ఆచరించిన సరిపోతుందని భావించు చున్నారు. ఇది పొరబాటు. ప్రతి స్థితిపరుడు జకాత్ వలె ఖుర్బానీ ప్రతి సంవత్సరము ఇవ్వ వలెను.

**03.** ఇంటికి ఒక ఖుర్బానీ ఇచ్చిన సరిపోతుందని కొందరు భావించు చున్నారు. ఇదికూడ పొరబాటే. ఇంటిలో భార్య, పిల్లలు, తల్లిదండ్రులు, సోదరీసోదరులు, ఎంత మంది స్థితిపురులుండిన, అంతమంది, ప్రతి ఒక్కరి తరపున విడివిడిగా ఖుర్బానీ ఇవ్వవలెను. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1యం స. 106)

## 31.4. ఖుర్బానీ చేయని వారికొరకు శాపము

"ఎవరిపై ఖుర్బానీ తప్పనిసరి (వాజిబ్) అయి యుండి కూడ ఖుర్బానీ చేయనిచో, అతడు మన ఈద్‌గాహ్ చెంతకు కూడ రాకూడదని" ముహమ్మద్

సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (ఇబ్నెమాజ) ఈ హదీసు మూలముగా ఖుర్బానీ చేయని వారిపై మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారికి గల అయిష్టత తెలియు చున్నది. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1యం స. 106)

## 31.5. ఖుర్బానీ జంతువులు

### 1. పెద్ద జంతువులు

ఒంటె యొక్క వయస్సు 5 సంవత్సరముల కన్నా తక్కువ యుండరాదు. ఎద్దు, ఎనుము (గేదె)ల వయస్సు రెండు సంవత్సరముల కన్నా తక్కువ యుండరాదు.

### 2. చిన్న జంతువులు

పొట్టేలు, గొర్రె, మేక, మేకపోతుల వయస్సు ఒక సంవత్సరమునకు తగ్గకుండ యుండ వలెను. దాని కన్న తక్కువ యున్నచో ఖుర్బానీ నెరవేరదు. కాని పొట్టేలు, గొర్రె ఆరు నెలల వయస్సు కలిగి యుండి కూడ సంవత్సరము వయస్సు కలదిగా లావుగా కనబడిన వాటిని ఖుర్బానీ ఇచ్చుట సమంజసమే. మేక, మేకపోతు ఎంత లావు యున్నను, ఎంత పెద్దదిగా కనబడినను, సంవత్సరమునకు ఒక రోజు తక్కువగా యున్నను వాటిని ఖుర్బానీ ఇచ్చుట తగదు. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1యం.స.106)

### సిద్ధాంతములు

**01.** చిన్న జంతువుల ఖుర్బానీ ఒక మనిషి తరఫుననే ఇవ్వ వలెను.

**02.** పెద్ద జంతువుల ఖుర్బానీ ఏడుగురి తరఫున ఇవ్వవచ్చును. కానీ ఏడుగురు కూడా ఖుర్బానీ సంకల్పముతోనో లేక అఖీఖా సంకల్పముతోనో అందులో భాగస్వాములు కావలెను. కేవలము మాంసము తినే ఉద్దేశ్యముతోనో లేక వేరేదైనా ఉద్దేశ్యముతోనో అందులో భాగస్వాములయినచో, ఎవరి ఖుర్బానీ కూడ నెరవేరదు.

**03.** పైన పేర్కొనబడిన జంతువులలో మగదైనను ఆడదైనను ఖుర్బానీ సక్రమమగును. ఎటువంటి లోపము లేదు.

**04.** ఖుర్బానీ జంతువు బాగుగా బలిసి ఆరోగ్యముగా యుండాలి. ఎటువంటి లోపము లేనిదై యుండాలి. కుంటిది, గ్రుడ్డిది, మిక్కిలి బలహీనమైనది అయి ఉండరాదు. దాని ఏ అవయవము అనగా తోక, చెవులు మొదలగునవి

మూడవ వంతు (1/3) కన్నా ఎక్కువగా తెగి యుండ కూడదు. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1యం స. 106)

**05.** ఏదైనా జంతువు యొక్క పళ్ళు లేకున్నను, ఎక్కువ పళ్ళు రాలిపోయి యున్నను, అది సక్రమముగా మేత మేస్తున్న యెడల ఖుర్బానీ ఇవ్వ వచ్చును లేనిచో అటువంటి జంతువును ఖుర్బానీ ఇచ్చుట తగదు. (జవాహిరుల్ ఫిఖ్ జి.1, స.450)

**06.** పుట్టుకతోనే చెవులు లేని జంతువును ఖుర్బానీ ఇచ్చుట తగదు. ఒకవేళ చిన్న చిన్న చెవులు యున్నచో ఖుర్బానీ ఇచ్చుట సక్రమమే అగును.

**07.** పుట్టుకతోనే కొమ్ములు లేనిది లేక కొమ్ములు విరిగి పోయి యున్న జంతువు తల లోని మాంసము కనపడనిచో, అటువంటి జంతువును ఖుర్బానీ ఇచ్చుట తగును. అట్లుకానిచో, ఖుర్బానీ ఇచ్చుట తగదు.

**08.** జంతువు కొద్దిగా కుంటుతూ ఉన్నప్పటికి జబహ్ చేసే ప్రదేశానికి నడచి వెళ్ళగలిగినచో, అటువంటి జంతువును ఖుర్బానీ ఇచ్చుట తగును. అట్లు నడవలేని స్థితిలో, ఖుర్బానీ ఇచ్చుట తగదు.

**09.** పిడుగు (వట్టలు) కొట్టిన జంతువును ఖుర్బానీ ఇచ్చుట ముస్తహబ్ (అభిలషణీయము) కాని మగ ఆడ కాని నపుంశక జంతువును ఖుర్బానీ ఇచ్చుట తగదు.

**10.** సూటి జంతువును ఖుర్బానీ ఇచ్చుట తగును. కానీ ఈనే సమయము దగ్గర పడిన జంతువును ఖుర్బానీ ఇచ్చుట మక్రూ అగును. సూటి జంతువును ఖుర్బానీ ఇచ్చినపుడు పిల్ల బ్రతికి యున్నచో దానిని కూడ జబహ్ చెయ్యాలి. దాని మాంసము తినుట కూడ తగును.

**11.** ఖుర్బానీ జంతువు యొక్క పాలు పితుకుట లేదా దాని వెంట్రుకలు కత్తిరించుట తగదు. ఒకవేళ అట్లు చేసినచో, దాని పైకము పేదలకు దానము చేయుట తప్పనిసరి (వాజిబ్) అయి యున్నది. (జవాహిరుల్ ఫిఖ్ జి.1, స.450)

## 31.6. ఖుర్బానీ (జబహ్) చేయు విధానము

ఖుర్బానీ జంతువును స్వహస్తాలతో (తనచేతులతో) జబహ్ చేయుట ఉత్తమము. అట్లు జబహ్ చేయలేనిచో, జబహ్ ఇతరుల చేత చేయించ వలెను. జబహ్ చేయునపుడు, ఎదుట నిలబడి యుండ వలెను. జంతువును ఆకలితోను,

దప్పికతోను యుంచరాదు. జంతువును ఎడమ వైపుకు, ఖిబ్లాకు అభిముఖముగా పరుండబెట్టి జబహ్ చేయవలెను. జబహ్ చేయు సమయమున ఈ క్రింది దుఆ చదువ వలెను:

**"ఇన్నీ వజ్జహ్‌తు వజ్హియ లిల్లజీ ఫతరస్సమావాతి వల్ అర్‌జ హనీఫం వ్వమా అన మినల్ ముష్‌రికీన్. ఇన్న సలాతీ వనుసుకీ వ మహ్‌యాయ వ మమాతీ లిల్లాహి రబ్బిల్ ఆలమీన్, లాషరీక లహూ వ బిజాలిక ఉమిర్‌తు వ అన మినల్ ముస్లిమీన్. అల్లాహుమ్మ మిన్‌క వలక** – (నేను ఏకోన్ముఖుడనై నా ముఖాన్ని, భూమి ఆకాశాలను సృష్టించినవాని (అల్లాహ్) వైపునకు మరల్చు చున్నాను. నేను ఆయనను మాత్రమే ఆరాధిస్తాను. నేను ముష్రిక్‌ను కాను అనగా ఎవ్వరినీ అల్లాహ్‌కు సహవర్తులుగా చేయువాడిని కాను. (సాటికల్పించు వారిలో లేను) నా నమాజ్, నా ఖుర్బానీ, నా జీవనము, నా మరణము సకల లోకాల ప్రభువైన అల్లాహ్ కొరకే. ఆయనకు భాగస్వాములెవ్వరూ లేరు. ఈ ఆజ్ఞయే నాకు ఇవ్వబడినది. అందరికంటే ముందు విధేయతను ప్రదర్శించు వాణ్ణి నేనే. ఓ అల్లాహ్ ! ఈ జంతువు నీవు ప్రసాదించినదే. అది నీ కొరకే సమర్పించ బడుతున్నది.

మరల **"బిస్మిల్లాహి అల్లాహు అక్బర్"** అని పలుకుచు జబహ్ చేయవలెను. జబహ్ చేసిన తరువాత ఈ దుఆ చదువ వలెను:

**అల్లాహుమ్మ తఖబ్బల్‌హూ "మిన్నీ" కమా తఖబ్బల్‌త మిన్ హబీబిక ముహమ్మదిం వ్వ ఖలీలిక ఇబ్రాహీమ అలైహిమస్సలాతు వస్సలామ్.** (నీవు ప్రియుడైన ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ మరియు మిత్రుడైన ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్‌ల ఖుర్బానీని అంగీకరించిన విధముగా నా ఖుర్బానీని కూడ అంగీకరించుము) ఒకవేళ ఇతరుల తరఫున జబహ్ చేసేట్లు యుండిన, **"మిన్నీ"** కు బదులుగా **"మిన్"** అని పలుక వలెను. దాని తరువాత ఎవరి తరఫున ఖుర్బానీ చేయుచున్నామో వారి పేరు లేక (అనేకులున్న) వారి పేర్లను పలుకవలెను. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1యం స. 107)

## 31.7. ఖుర్‌బానీ మాంసమును పంచుట

ఖుర్‌బానీ మాంసమును మూడు భాగాలు చేయ వలెను. వాటిలో ఒక భాగము పేదలకు, ఒక భాగము బంధువులకు పంచి, ఒక భాగము స్వంతమునకు

ఉపయోగించుట ఉత్తమమై యున్నది. ఒకవేళ మాంసము నంతయు స్వంతానికి ఉపయోగించుకొనుటయు తగును. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1యం స. 108)

## 31.8. ఖుర్‌బానీ చర్మమును ఎవరికి ఇవ్వాలి?

ఖుర్‌బానీ చర్మము జకాత్ హక్కుదారులకు ఇవ్వవలెను. ఖుర్బానీ చర్మము గాని దాని రొఖ్ఖము గాని జంతువును కోసిన ఖసాయి వానకి కూలిలో ఇచ్చుట, మసీదు కొరకు ఖర్చు చేయుట, లేక ఏదైనా పుణ్యకార్యములో ఖర్చు చేయుట తగని పని. హా! ఒకవేళ ఖుర్బానీ చర్మము స్వంతానికి కూడ ఉపయోగించు కొన వచ్చును. కాని దానిని అమ్మినచో, ఆ సొమ్ము పేదవారికి ఇచ్చివేయ వలెను. (బిహిష్తీజేవర్, 3/36, దీనియాత్ 1యం స. 108)

# 32. నఫిల్ ఉపవాసాలు

ఆత్మ వికాసము, హృదయ నిర్మలత్వము, అల్లాహ్ సాన్నిధ్యాన్ని పొందడానికి ఇతర నఫిల్ ఆరాధనల వలెనే నఫిల్ ఉపవాసాలు కూడ పాటించాలని మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపి యున్నారు. స్వయముగా మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు అత్యధికముగా నఫిల్ ఉపవాసాలు పాటించి మనకు మార్గదర్శకులైరి.

హదీసులలో కొన్ని నఫిల్ ఉపవాసాల విలువ, ఔన్నత్యాలను గురించి తెలుప బడియున్నది. వాటిని గురించి ఇక్కడ తెలుపెదను.

## 32.1. జిల్‌హిజ్జా మొదటి తేదీ నుండి తొమ్మిదవ తేదీ వరకు

జిల్‌హిజ్జా అనగా బక్రీదు నెల మొదటి తేదీ నుండి తొమ్మిదవ తేదీ వరకు ఉపవాస ముండ వలెను. అట్లు కుదరనిచో అరఫా రోజైన ఉపవాస ముండాలి. ఈ రోజులలో ఒక్కొక్క రోజు ఉపవాస ముండుట ఒక సంవత్సరపు ఉపవాసము లుండుటతో సమానము. (తిర్మిజీ, మిష్కాత్/128)

"ప్రస్తుతము హజ్ చేయనివారు, బక్రీద్ నెలలోని 9వ తేదీన అనగా అరఫా రోజున ఉపవాస ముండుటచే పూర్వపు ఒక సంవత్సరపు (గత ఏడు) పాపములు, తరువాతి ఒక సంవత్సరపు (వచ్చే ఏడు) పాపములు అల్లాహు తఆలా క్షమించునని నాకు సంపూర్ణ నమ్మక మున్నదని" మన ప్రవక్త హజ్రత్

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (ముస్లిమ్, అహ్మద్) (ము ఖ కే లియే 20 సబఖ్, స.30)

## 32.2. ముహర్రమ్ నెల 10వ తేదీ ఉపవాసము

ముహర్రమ్ నెల పదవ తారీఖున ఉపవాస ముండుటచే గత ఒక సంవత్సరపు పాపములు, అల్లాహు తఆలా క్షమించునని నాకు సంపూర్ణ నమ్మక మున్నదని" మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరి. (ముస్లిమ్)

ముహర్రమ్ నెలలో 9 మరియు 10 లేక 10 మరియు 11వ తేదులలో ఉపవాస ముండ వలెను. 10వ తేదీ, ఒక్కరోజు యూదులు ఉపవాస ముందురు. కావున ఒక్కరోజు అనగా 10 వ తేదీ మాత్రమే ఉపవాసము ఉండిన యూదులను అనుసరించి నట్లు అగును. కావున ఇట్లు చేయరాదు.

### గమనిక

ఒక సంవత్సరపు పాపములనిన చిన్న పాపములని (సగీరా గునాహ్) అర్థము. అవే ఎక్కువగా యుంటాయి. కొద్దిగా ఆకలిదప్పులకు ఓర్చిన అల్లాహు తఆలా ఎంత పెద్ద బహుమానము, కారుణ్యమును ప్రసాదించు చున్నాడో గమనింపుడు. (ముస్లిం ఖవాతీన్‌కెలియే 20 సబఖ్, స.29)

## 32.3. షబె బరాత్ రోజున ఉపవాసము

"షాబాన్ నెల 15వ తేదీ రాత్రి (నఫిల్) నమాజ్‌లు ఆచరించ వలెను, పగలు ఉపవాముండ వలెనని" షబె బరాత్ విషయముగా హదీసు గ్రంథాలలో తెలుపబడి యున్నది. (ముస్లిం ఖవాతీన్ కే లియే 20 సబఖ్, స.30)

## 32.4. షవ్వాల్ నెలలో 6 ఉపవాసాలు

షవ్వాల్ నెలలో 6 ఉపవాసాలు శ్రద్ధగా పాటించ వలెను. **"ఎవరైనా రమజాన్ నెలంతయు ఉపవాసము లుండి, షవ్వాల్ నెలలో 6 రోజులు ఉపవాసము లుండినచో, అతనికి జీవితాంతము ఉపవాసము లుండి నంత పుణ్యఫలము లభించునని"** హజ్రత్ రసూలుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు తెలిపిరని హజ్రత్ అబూ అయ్యూబ్ అన్‌సారీ రజియల్లాహు అన్హు తెలిపిరి. (సహీహ్ ముస్లిమ్/ 2758, బుఖారీ)

"రమజాన్ ఉపవాసములు 10 నెలలు, షవ్వాల్ నెలలో 6 ఉపవాసాలు

రెండు నెలలతో సమానము. ఈ విధముగా ఇవి ఒక సంవత్సరపు ఉపవాసాలతో సమానమగునని" ఇంకొక హదీసులో కలదు.

ఈ ఉపవాసాలు రమజాన్ పండుగ వెంటనే గానీ లేక ఆలస్యముచేసి షవ్వాల్ నెలలో గానీ ఉండ వచ్చును. 6 ఉపవాసాలు వరుసగా గాని, లేక విడివిడిగా గానీ ఉండ వచ్చును.

## 32.5. ప్రతి ఇస్లామీ నెల 13, 14, 15 తేదీలు

ప్రతి ఇస్లామీ నెల 13, 14, 15 తేదీలను "అయ్యామె బైజ్" అందురు. ఈ రోజులలో ఉపవాస ముండుట మిక్కిలి విశిష్ఠమైనదిగా పేర్కొనబడి యున్నది. "ప్రతి అరబీ మాసములోని మూడు పున్నమి దినాలలో అనగా 13, 14, 15 తారీఖులలో ఉపవాసము పాటించమని మన ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు మమ్మల్ని ఆదేశించిరి. ఆ మూడు ఉపవాసాలు పాటించుట జీవితాంతము ఉపవాసాలు పాటించుటతో సమానమని సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారు చెప్పేవారు" అని హజ్రత్ అబూజర్ర్ గఫ్ఫారీ (రజియల్లాహు అన్హు) తెలిపిరి.

## 32.6. ప్రతి సోమవారము మరియు గురువారపు వుపవాసము

ప్రతి సోమవారము, గురువారము మానవుల ఆచరణలు (అల్లాహ్ సన్నిధిలో) ప్రవేశపెట్టబడతాయి. అందుచేత నా ఆచరణలు, నేను ఉపవాసమున్న స్థితిలో ప్రవేశపెట్టడాన్ని నేను ఇష్టపడు చున్నాను. (అహ్మద్, తిర్మిజీ)

**ఇచ్చట నఫిల్ ఉపవాసాల శ్రేష్ఠతను తెలిబరచి యున్నాము. ఎవరు ఎంత వరకు వీలైతే అంత ఎక్కువగా ఉపవాసాలు పాటించి పుణ్యాన్ని కూడగట్టుకొన వలెను.**

### హెచ్చరిక

**01.** ఎవరైనా నఫిల్ ఉపవాసముండుట ప్రారంభించిన తరువాత దానిని పూర్తి చేయుట తప్పనిసరి (వాజిబ్) అవుతుంది. ఏదైనా కారణముచే ఆ ఉపవాసము భంగమైతే, లేక భంగ పరచినచో, ఆ తరువాత దాని ఖజా ఆచరించుట తప్పనిసరి (వాజిబ్) అవుతుంది.

**02.** స్త్రీలు బహిష్టు వలన వదిలి పెట్టిన రమజాన్ నెలలోని ఉపవాసాల ఖజాను వీలైనంత త్వరగా పాటించ వలెను. చాలా మంది ఈ విషయముగా

నిర్లక్ష్యము వహించుదురు. దీని వలన అనేక ఉపవాసాలు ఖజా చేయ వలసి యుంటుంది. అప్పుడు ధైర్యము చాలక విడిచిపెట్టు చున్నారు. పాపాత్ములు గానే మరణించు చున్నారు.

**03.** ఫర్జ్ ఉపవాసము గాని నఫిల్ ఉపవాసము గాని, వాటిని గౌరవించ వలెను. అనగా ఉపవాసముండి చాడీలు చెప్పుట, అపద్దమాడుట, తిట్టుట మొదలగు వాటికి దూరముగా యుండాలి. పురుషులు పరస్త్రీని, స్త్రీలు పరపురుషుని చూడకుండ జాగ్రత్త వహించ వలెను. అన్ని విధాల పాపకార్యాలకు దూరముగా యుండాలి. పాపకార్యము అన్నివేళల చెడ్డదే. అది మనలను నాశనము చేయును. కానీ ఉపవాసముండి చెడు కార్యములు ఆచరించిన, అవి ఉపవాసము యొక్క శ్రేయస్సును, శుభాలను, దాని వలన కలుగు మేలును నశింప చేస్తుంది. దానివలన లభించే పుణ్యము కూడ లోపించును.

"ఉపవాస వ్రతమును పాటించు చాల మందికి ఆకలి దప్పులు తప్ప పుణ్యఫల మేమియు లభించదు. కారణమేమన, ఉపవాసము వలన లభించు పుణ్యఫలమును చాడీలు చెప్పుట, అపద్దమాడుట, ఇతర పాపకార్యాలు చేయుటచే పుణ్యఫలాన్ని పోగొట్టుకొను చున్నారని" హజ్రత్ రసూల్లుల్లాహ్ సల్లల్లాహు అలైహి వ సల్లమ్ గారి తెలిపిరి. **"ఉపవాసముండి, అపద్దమాడుటను, చెడుకార్యాలను విడువకుండ యున్నయెడల అటువంటి వ్యక్తి ఆహార పానీయాలు విడిచి పెట్టుట అల్లాహ్‌కు అవసరము లేదని" కూడ పేర్కొన బడి యున్నది.** (ముస్లిం ఖవాతీన్ కే లియే 20 సబఖ్, స.30)

**********

**మన ప్రవక్త (స) గారు ఇట్లు తెలిపిరి: ప్రపంచమును విడిచిపెట్టి (ఆరాధనలు మరియు పరలోకపు ప్రయత్నముచేసి) నప్పుడు, అల్లాహు తఆలా మిమ్ములను తన ప్రియమైన వానిగా చేసుకొనును. ప్రజల చెంత యున్న సంపద మరియు హోదాలను ఆశించనప్పుడు, ప్రజలు మిమ్ములను ప్రేమింతురు.** (మిష్కాత్, 442)